# వి ష య సూ చి క

# స్వార్థపరులు

నాలుగైదుసార్లు తడితేనేకాని తలుపులు తెరవబడలేదు. అసలే రాత్రి పన్నెండు దాటింది. బైట చీకటి గాఢాంధకారం. దానికితోడు సన్నని వానతుంపర ఆరంభమైంది. మొత్తంమీద తడవకుండానే గోపాలం ఇల్లు చేరుకోగలిగాడు. కాని తలుపులు తెరిచేలోపుగానే తాను తడిసి ముద్దయిపోతానేమో ననే భయమూ, ఆత్రుతా ఆతన్ని వేధించసాగినై. ఇంతకు పూర్వంలేని తొందరంతా అతనిలో కరుడుకట్టి—పనివాడిపట్ల కోపాన్నీ, విసుగునూ పెంచినయ్.

నిద్రకళ్ళతో పనివాడు తలుపులు తెరిచాడు. పెనుగాలల్లే గోపాలం లోపలికి ఉరికాడు.

"ఎప్పుడూ నిద్దరే—వెధవనిద్దరా నువ్వూను" అని పనివాడిమీద విరుచుకు పడ్డాడు.

పనివాడు చలించలేదు. వాననీళ్ళు లోపలికిరాకుండా తలుపులు మూసేశాడు.

"తమకోసం ఎవరో వచ్చారు" అన్నాడు పనివాడు.

గోపాలం ఎలాంటి ఆత్రుతనూ చూపలేదు.

"నాలుగైదుసార్లు వొచ్చారు" అన్నాడు పనివాడు.

గోపాలం విన్నాడు కాని వినిపించుకోనట్లే వూరుకున్నాడు. మామూలుగా వొచ్చే అప్పులవాళ్ళే ఐవుంటారని

అతని వూహా! లేకపోతే నాలుగైదుసార్లు వొచ్చే ఓపిక ఎవరికుంటుంది కనుక? ఈవిధంగా తననూ, తన ఇంటినీ చుట్టుముట్టే ఈ అప్పులవాళ్ళ బారినుంచి రక్షించుకునేందుకే గోపాలం ఉదయం ఆరుగంటలనుంచీ, రాత్రి పన్నెండింటిదాకా వూరిమీద బలాదూర్లకు వెళ్తూండటాన్ని దిన చర్యగా చేసుకున్నాడు...

పనివాడు వొదలలేదు.

అన్నాడు: "కారులో వొచ్చారు—"

మళ్ళీ ఇంటాయన కోయంబత్తూరునుంచి దిగాడేమోనని గోపాలం మనస్సులో రాయిపడింది. తన అప్పులవాళ్ళల్లో కారుమీదవొచ్చే తాహతున్నవాళ్ళు ఇంటియజమానితప్ప వేరెవ్వరూ లేరు. తాను వూహించిందే నిజమైతే, తాను ప్రశాంతంగా గడిపే ఆరుగంటలూకూడా ఏ పేవ్‌మెంట్ మీదనో, లేక ఏ స్నేహితుడి పంచనో గడపాల్సి వుంటుంది.

తన ఆలోచనల్లో మునిగితేలుతున్న గోపాలం పనివాడి వంకన్నా చూడలేక పొయ్యాడు. ఐతే పనివాడు తన విధ్యుక్తధర్మాన్ని మరిచిపోలేదు.

"ఆయన ఎర్రగా, పొడుగ్గా వున్నారు."

అట్లాగైతే ఇంటియజమాని కాదు. ఇంటాయన నల్లగా పొట్టిగా వుంటాడు. మరెవరై వుంటారు? తన దృష్టిపోయినంత మేరలో తన అప్పులవాళ్ళల్లో ఎర్రగా పొడుగ్గా వుండేవాళ్ళెవ్వరూ లేరు. ఇప్పటిక్కాని గోపాలానికి ఆ వొచ్చిన వ్యక్తి ఎవరో తెలుసుకోవాలనే కుతూహలం కలగలేదు.

"ఏ వూరట?" అన్నాడు.

"బందరటండి"

"పేరు—?"

"పాండురంగారావు గారటండీ!—"

బందరులో తనకు మిత్రులెవ్వరూ లేరు. యీ పాండురంగారావెవరో, అతనికి తనతో పనేమిటో ఎంత ఆలోచించినా గోపాలానికి అర్థంకాలేదు. ఇంకా వివరాలు తెలియ చెప్పలేని పనివాణ్ణి వేధించకుండానే పక్కమీద నడుం వాల్చాడు గోపాలం.

చాలా అలసివున్న గోపాలానికి యధాప్రకారంగా గాఢ నిద్ర రావలసిందే...కాని ఆ పాండురంగారావునుగూర్చి తీవ్రంగా ఆలోచించసాగాక, నిద్రాదేవి విరోధమవక తప్పలేదు.

ఒక విషయంమాత్రం నిర్ధారణగా తేలిపోయింది. యీ పాండురంగారావు తన అప్పులవాడు మాత్రంకాదు. మరెవరో ఎంత ఆలోచించినా తేలకుండా వుంది, నాలుగైదుసార్లు వొచ్చి పొయ్యాడంటే ఏదో ముఖ్యవిషయమే ఐవుండాలి... వ్యవహారం ఏదో తనకు మేలుకలిగేదే ఐవుంటుందనే భావన గోపాలం మనస్సులో మెదిలింది.

దాంతో అతను మేలుకునే ఒక గొప్ప కలకన్నాడు. తాను మళ్ళీ ఫిలింతీసినట్లు, అది శతదినోత్సవాలవరకూ వెళ్ళినట్లు, మొదటి ఫిలింలో తానూ, తన యితర భాగస్వా

ములూ చేసిన అప్పులన్నీ తీర్చటమే గాక, తాను స్థాపించిన సంస్థ గొప్పదై సుస్థిరమైనట్లూ, తన దర్శకత్వపు ప్రతిభ దేశమంతటా పాకినట్లూ—ఆకలలో గోపాలం ప్రత్యక్షంగా చూడగలిగాడు. వింత వింత భావాలెన్నో అతని మనస్సును ఆనందపరిచినవి. రొంపిలో యిరుక్కున్నవాడికి పనికిరాని చిన్న గడ్డిపోచ దొరికినా, బైటపడేందుకు గొప్పఅవకాశం ఏర్పడిందనే దురభిప్రాయం కలిగినట్లే, గోపాలంలో యీ పాండురంగారావు ఒక మేరుపర్వతమై వెలుగొందాడు.

ఈ తీయని తలుపులతోపాటు బైటవర్షంపడుతూచేసే మృదువైనధ్వనీ, స్వచ్ఛమైన నీటిమీదనుంచి. వీచే సన్నని గాలీ ప్రాణానికి ఎంతో హాయినిస్తున్నవి. గోపాలం బడలికంతా పోయింది. యీ రాత్రంతా ఇలాగే యీ వర్షాన్ని చూస్తూ, ఆకాశంలో వుండివుండి మెరిసే మెరుపుల్ని చూస్తూ గడపాలనే నిశ్చయం ఏర్పడింది.

కాని ఆలోచనలనేవి ఎప్పుడూ మనస్సుకు ఆనందాన్ని కలిగించే దిక్కునేసాగవు. క్రమంగా అవి రెండోదిక్కుకు మొగ్గసాగినవి. ఇంతా ఏడుస్తే ఈ పాండు రాంగారావు ఏ హీరోవేషానికన్నా పాకులాడుతున్నాడేమో? ఎర్రగా పొడుగ్గా వుంటాడనికదా పనివాడు చెప్పింది; ఏదో అందమైనవాడే ఐవుండొచ్చు. సినిమాపిచ్చితో మెద్రాస్ వొచ్చిన వాళ్ళల్లో ఒకడు కావొచ్చు, కాస్తో, కూస్తో వున్నావాడైతే, వొచ్చిన కొత్తల్లో తెచ్చుకున్న డబ్బులోనుంచి టాక్సీలెక్కి

తిరగొచ్చు. టాక్సీవల్ల కాస్త ఖర్చు కనిపించినా, అందువల్ల హోదా ఎంత పెరుగుతుంది! ఈ పాండురంగారావు ఈరకం వాడే కనుక ఐతే?—

ఈ అనుమానం రాగానే గోపాలం ఒళ్ళు జలదరించింది; గొంగళిపురుగులు శరీరమంతా పాకినట్లయింది. ఆ పాండు రంగారావుగాడు తన మిత్రుడైనా. శత్రువైనా ఇంత వేధిం చేవాడు కాడు. వాడు ఏ పక్షంవాడో ఖచ్చితంగా తెలిసినా ఈ బాధవుండేది కాదు. ఇంతకుపూర్వం కన్న మధురస్వప్న మంతా, క్షణంలో పీడకలగా మారింది. తీపిపదార్థం తిన్నాక సముద్రంలో నీళ్ళు తాగినట్లయింది.

ఎంతప్రయత్నించినావ్యూహాలు చెడును సూచించకుండా ఉండటంలేదు. రెండు రకాల ఆలోచనలూ కలిసి అతన్ని నిద్దర పోనివ్వటంలేదు. ఎంతో హాయిగా వుండే వాతావర ణమే భరించరానంతగా మార్పుచెందుతూండటంకూడా గోపాలం గమనించకపోలేదు.

ఈ పాండురంగారావు ఎవడో తెలిస్తేనే కాని తన మన స్సులోని అశాంతి చల్లారదు. అది తేలాలంటే తెల్లారా ల్సిందే. కాని తెల్లారాక తను ఇంట్లోవుంటే మరికొన్ని కొత్త సమస్యల్ని ఎదుర్కోవాల్సి వుంటుంది. తనకోసం వొచ్చేవాళ్ళంతా కేవలం అప్పులవాళ్ళేకావటం పెద్ద ప్రమా దం. ఆ వొచ్చేవాళ్ళల్లో తాను తెలుసుకోవాల్సింది ఒక్క పాండురంగారావే కావటంవల్ల, అతనికోసమై మిగతావాళ్ళ బాధనుకూడా భరించాల్సి వుంటుంది...

అప్పులవాళ్ళ భరించలేకనే ఈ అడవిలో ఇల్లు తీసు కున్నాడు. ఐనాకూడా తన క్షేమాన్ని ఒక కంట కనిపెడు తూనేవున్న ఈ ఋణదాతలు, తన అజ్ఞాతవాసానికి భంగం కలిగించారు; మళ్ళీ ఇల్లు మారుద్దామంటే, కొత్తయింటికి ఎడ్వాన్సు కావాలాయె! ఈ పరిస్థితుల్లో తనకోసం వొచ్చే వాళ్ళంటేనే గోపాలానికి పెద్ద భయ మేర్పడిపోయింది.

మరి యీ పాండురంగారావునుగూర్చి తెలుసుకోడటం ఎలా ? గోపాలంలోని కుతూహలం, జ్వాలల్ని కక్కసాగింది. పోనీ ఆ పాండురంగారావు మెడ్రాస్‌లో ఎక్కడ వుంటాడో తెలుస్తే, యీ అర్ధరాత్రి, యీ వానలో తనే అక్కడికి పోయొచ్చేవాడు.

గడియారం రెండు దాటినా అతని ఆలోచనలు తెగ లేదు: ఆలోచనా ప్రవాహంలాగే, ధారాపాతంగా వాన పడుతోంది. మెరుపులకాంతిలో రోడ్డుమీద కాలవలుకట్టి ప్రవహించే నీరు స్పష్టంగా కనిపిస్తోంది. గాలికూడా సాగి నందువల్ల, చెట్లకొమ్మలు చేసే శబ్దం, వర్షపాతానికి లయ కలుపుతోంది. ఐతే గోపాలం వాతావరణాన్ని గమనించే స్థితిలో లేడు. అతని వూహలన్నీ ఆ పాండురంగారావునే ఆవరించి ఉన్నవి.

అకాత్తుగా దూరాన వినిపించిన కారు హారన్ గోపాలం ఆలోచనలకు అంతరాయం కలిగించింది. ఎందుకనో కానీ, ఆ కారు తనకోసమేనని, ఆ కారులో ఆ పాండురంగారావే

వొస్తున్నాడనే నమ్మకం అతని కుతూహలాన్ని మిన్ను ముట్టేట్లు చేసింది. శరీరమంతా కంపించి, పక్కమీదినుంచి లేవలేని స్థితికి వొచ్చాడు.

కారు తన ఇంటివైపే వొస్తున్న సంగతి గోపాలానికి తెలియకపోలేదు. కారు సమీపిస్తున్నకొద్దీ ఏదో వెర్రిఉత్సాహం అతనిలో బయలుదేరింది... కాని ఆ కారు తనకోసం కాకుంటే? జీవితంలో ఆశకూ నిరాశకూ వున్న పొలిమేరల్లో కొట్టుకులాడడం ఎంత బాధావహమో గోపాలానికి యీ రాత్రి బాగా అర్థమౌతోంది.

అదృష్టవశాత్తూ కారు తన ఇంటిముందే ఆగింది. చప్పున దిగివెళ్ళి తలుపులు తీయాలనే జ్ఞానం గోపాలానికి కలగకపోలేదు; కాని అతని ఆత్రుత అతన్ని కదలనివ్వలేదు.

ఇంటి తలుపు తట్టడం "గోపాలంగారూ! గోపాలంగారూ!" అని కేకలు వేయటం జరుగుతోంది. ఆ కంఠస్వరం తనకు అపరిచితమైనదే! అవతల పెద్దమనిషి వానలో తడిసిపోతూన్నాడనీ, తాను ఇంతవరకూ వూపిరి తిరగకుండా ఆలోచిస్తూన్న పాండురంగారావే ఆ పెద్దమనిషి ఐవుంటాడనీ, తలుపు తీయటం ఆలస్యమైతే, ఇక లాభంలేదని కారులో తిరిగి వెళ్ళిపోతాడనీ గోపాలానికి తెలుస్తూనేవుంది ...కాని ఆత్రుత, ఆ కంపం అతని శక్తులన్నిటినీ కట్టివేసింది!

పట్టుబలపంతాన ఆత్రుతను తగ్గించుకున్నాడు. ఈ అర్థరాత్రి, వానలో తనకోసం వొచ్చిన యీ అపరిచితవ్యక్తి,

ఒక విధంగా తన భావిజీవితంలోని గొప్ప మార్పుకు కారణ భూతుడవుతాడనె నమ్మకం గోపాలం మనసులో గాఢంగా నాటుకునిపోయింది. ఏమైనా యీ సన్నివేశాన్ని ఎదుర్కో-గల శక్తిని పుంజుకునేలోగానే, పనివాడు తనముందు ప్రత్యక్షమయ్యాడు. మేలుకొన్నతను వెళ్ళి తలుపు తీసేముందే, నిద్రిస్తూన్న పనివాడు, ఆ వ్యక్తిని లోన ప్రవేశపెట్టినందుకు, గోపాలం సిగ్గుపడక తప్పలేదు.

"బాబూ! పాండురంగారావుగారు......" అన్నాడు పనివాడు.

"వాస్తున్నాను—"

గోపాలం వొళ్ళు విరుచుకొన్నాడు. బలంగా తలకాయను అటూయిటూ తిప్పాడు—ఇంతకుపూర్వం తలకాయలో పనిచేస్తున్న రకరకాల ఆలోచనల్ని విదిలించుకునేందుకు ప్రయత్నంచేసినట్లు! కొంత స్టిమ్యులేషన్‌కోసమై సిగరెట్ వెలిగించాడు. తనలోతానే హెచ్చరికలు చేసుకొని మేడ మెట్లు దిగ నారంభించాడు.

పాండురంగారావు కుర్చీలో కూలబడి తడిసిన గుడ్డల్ని పరీక్షిస్తున్నాడు. మెట్లమీాద చప్పుడు విని తలపైకెత్తాడు. మొదటి చూపులోనే యీ పాండురంగారావు మొహం చాలా పరిచయమైనదిగా గోపాలానికి తోచింది. ఐతే ఆ పరిచయం ఎక్కడిదో ఎంత తన్నుకున్నా అతనికి గుర్తురాలేదు.

తను అనుకున్నట్లుగా పాండురంగారావు లేచి నిలబడనూ

లేదు; తనకు నమస్కరించనూలేదు. పై పెచ్చు ఎంతో స్నేహమున్నట్లుగా చిరునవ్వుతో పలకరించాడు. గోపాలం పెద్ద యిబ్బందిలో పడ్డాడు: లాంఛనంగా తనూ ఒక చిరునవ్వుతోనే జవాబుచెప్పాడు.

"ఏం జ్ఞాపకంరాలేదా?" అన్నాడు, పాండురంగారావు.

గోపాలం పాండురంగారావును నఖ శిఖ పర్యంతమూ చూశాడు; కాని పోల్చుకోలేక పోతున్నాడు.

"ఆc." అని నీళ్లునమిలాడు గోపాలం.

"నేను పాండును...గుంటూరు కాలేజీలో మనం—"

పద్నాలుగేళ్ళనాటి జీవితం గోపాలం కళ్ళముందు మెరిసింది. ఒకనాటి ప్రియమిత్రుణ్ణి వెంటనే గుర్తుపట్టలేకపోయినందుకు గోపాలం సిగ్గుపడ్డాడు; తనను జ్ఞాపకం వుంచుకోగలిగిన పాండునుచూసి గోపాలం మరింత ముడుచుకుపొయ్యాడు. ఐతే ఈ వికారాలేవీ పాండు గమనించకుండా ఉండేందుకు గోపాలం వ్యర్థప్రయత్నం చేయలేదు.

"మరిచి పోలేదోయ్ పాండూ! నిద్రకళ్ళతో......" అన్నాడు లౌకికంగా తెలిసిన గోపాలం.

పాండు వ్యవహారం సగం తేలిపోయిం దనిపించింది గోపాలానికి. పూర్వపు స్నేహాన్ని మరిచిపోకుండా తనను చూసిపొయ్యేందుకు వొచ్చి వుంటాడు. కాని ప్రస్తుత పరిస్థితుల్లో బంధువులుకానీ, మిత్రులుకానీ తనను చూసేందుకు గోపాలానికి ఒళ్ళుమంట. ఆమాటకొస్తే ఈ అజ్ఞాతవాసం తాను

2

ఒంటరిగానే గడుపుతున్నాడు. చివరకు భార్యా, బిడ్డల్ని కూడా అత్తవారింటికి పంపేశాడు. తనకు మంచి రోజులు వొచ్చేదాకా సాధ్యమైనంతవరకూ వ్యక్తుల్ని తప్పించుకొని తిరగటం తప్పనిసరి అని ఏనాడో తేల్చుకున్నాడు. ఈ పరిస్థితుల్లో పాండురంగారావు, ఏదో అంతా మునిగిపోయినట్లు ఈ అర్ధరాత్రి, వానలో తనకోసం రావటం గోపాలానికి ఎంతో నిరుత్సాహాన్ని కలిగించింది. పాండుకు తన నిజస్థితి తెలుసేమోనని ఒకపక్క భయం; ఒకవేళ తెలియకపోతే, ఏవిధంగా తెలియచెప్పాలో, యెలా నటించగలగటమో అర్థంకాని భయం వేరొకపక్క అతన్ని బాధించసాగింది.

రెండు నిమిషాలపాటు ఎవ్వరూ మాట్లాడలేదు. ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు. తన బుర్రలో కదుల్తాడే ఆలోచనలు పాండుకు తెలియకపోవటం గుడ్డిలోమెల్ల అనిపించింది గోపాలానికి......

ఐతే కేవలం మిత్రుణ్ని చూసి పొయ్యేందుకు మాత్రమే పాండు వొచ్చి వుంటాడనే మాటను ఎంత ప్రయత్నించినా గోపాలం నమ్మలేకుండా వున్నాడు. మిత్రుణ్ని చూడాలని ఎంత తహతహలాడినా ఇంత శ్రమపడి రానక్కర్లేదు. మరేదో విశేషం వుండివుండాలి. ఏమైనా అదేదో త్వరగా తేల్చుకోవటం మంచిది. ఆతృతా, కుతూహలం పూర్తిగా చల్లారినవి; ఒకపక్క నిద్రకూడా ముంచుకొని వొస్తోంది.

నిశ్శబ్దాన్ని పాండు భంగపరిచాడు.

"అతి ముఖ్యవిషయమొకటి మాట్లాడాలని వొచ్చాను."

విషయప్రాముఖ్యతను తాను చాలాసేపటికిందే గుర్తించాడు. ఆ ముఖ్యవిషయం డబ్బు అప్పుఅడగటం కాకుంటే ప్రస్తుతానికి అదే పదివేలు అనుకున్నాడు గోపాలం.

మొహం పైకెత్తి 'చెప్పు' అన్నట్లు పాండువైపు చూశాడు: గోపాలం మనస్సు చాలా ప్రశాంతంగా వుంది. ఏమౌతుందో ననే ఆతృత పూర్తిగా తగ్గిపోయి, ఆ అవబోయ్యేది అతిసామాన్య సంఘటనే చిన్నచూపు ఆరంభమవటం ఒక విధంగా గోపాలానికి గొప్ప మనశ్శాంతిని చేకూర్చింది.

"ఏంలేదు—పిక్చరొకటి తీద్దామని వొచ్చాను"అన్నాడు పాండు.

చల్లారిన ఆతృత ఒక్కసారిగా గోపాలంలో విజృంభించింది. ఇదేదో తనకు సానుకూలమయ్యే వ్యవహారంగానే తోచింది. తన దరిద్రమంతా ఈ అర్థరాత్రి తీరిపొయ్యే సూచన కనిపించింది. ఐతే ఈ సమయంలో బైటపడకుండా వుండేందుకు గోపాలం ఎంతగానో ప్రయత్నించాడు.

"రొక్కం వుందా—లేకపోతే డిస్ట్రిబ్యూటర్సమీద ఆధారపడాల్సిందేనా?" అని అడిగాడు గోపాలం; పిక్చర్‌కు డబ్బేప్రాణం అనే సంగతి, మొదటి పిక్చర్‌తోనే గోపాలానికి బాగా అర్థమైంది; ఆ అనుభవాన్ని గోపాలం వృథాపోనియ్యలేదు.

"రెండు లక్షల రొఖ్ఖం సరిపోదా?"

గోపాలం ఇంత పెద్ద అంకెను జీవితంలో వినివుండలేదు. రెండు లక్షల రొఖ్ఖం! యీసారి తను సమర్థుడైన డైరెక్టర్ అయ్యే అవకాశం! తనను నమ్ముకొనివున్న నిర్మలకుమారి హీరోయిన్ అయే సదవకాశం! తనరోజులు మంచివి కాకపోయినా, నిర్మలకుమారి అదృష్టమే కావొచ్చు.

"దివ్యంగా సరిపోతుంది. కాస్తోకూస్తో తరుగైనా డిస్ట్రిబూటర్ చూసుకుంటాడు" అన్నాడు గోపాలం.

"ఈ పెట్టుబడిలో ఒక డొంకతిరుగుడు పద్ధతిని అవలంబించాలి......"

ఈ రకం పద్ధతులు క్రొత్తకావు కనుక గోపాలం ఆశ్చర్యపడలేదు. పాండు చెప్పేది వినేందుకు తాను సిద్ధంగా వున్నట్లు సూచించాడు.

"ఏం లేదు......పెట్టుబడిదారుడు నాకు స్నేహితుడు. బాగా డబ్బున్నవాడు. యుద్ధసమయంలో రకరకాల వ్యాపారాలు చేసి చాలా డబ్బు సంపాయించాడు. ఇప్పుడు వ్యాపారాల్లో అంతలాభం కనిపించినందువల్ల మానుకున్నాడు. నానాఅవస్థా పడి ఈ వ్యాపారంలోకి దింపాను" అన్నాడు పాండు.

"ఆయన ప్రియురాల్ని ఎవరినన్నా హీరోయిన్ చేయాలా యేం!" అని అనుమాన్ని బైటపెట్టాడు గోపాలం.

"ప్రియురాలూ లేదు—పిడుగురాళ్ళూ, లేదు.ఇంకా అంత దూరం పోగలిగే సామర్థ్యంవున్న మనిషి కాదులే. వాంపార

దృష్ట్యా పరిశీలించి చూస్తాడు. రెండు. లక్షల్లోనే పిక్చరు ఐపోతుందనే నమ్మకాన్ని మనం కలిగించాలి"

"కలిగిద్దాం—అదేమంత పెద్ద పనికాదు"

"కాగితంమీద కూడికలు సరిపోతే చాలు. ఆ తరువాత అవకపోయినా అంత ఇబ్బంది లేదు,'

గోపాలం చిరునవ్వు నవ్వాడు; పాండు కూడా తన మన స్తత్వంవాడే ఐనందుకు అతనికి ఎంతో తృప్తికలిగింది.

"ఒక్క మాట—" అన్నాడు పాండు "యీ పిక్చర్ లో మనం కొంత సొమ్ము చేసుకోవాలి. పిక్చర్ జయాపజయాలు దైవాధీనాలే అనుకో. ఎటుపోయి ఎటువొచ్చినా మనం బాగుపడాలి."

"మరీ మంచిది. అలాగే చేద్దాం"

"చెరిసగం తీసుకుందాం—"

"అట్లాగే" అని తన అంగీకారాన్ని తెలియపరిచాడు గోపాలం.

"నిన్ను గూర్చి చాలా గొప్పగా చెప్పాను. నీ మొదటి పిక్చర్ ఫెయిల్ ఐనందుకు, నీతో సహకరించని పెట్టుబడి దార్లనూ, టెక్నిషియన్సునూ దుమ్మెత్తిపోశాను. నీవూ అదే ధోరణిలో మాట్లాడితే అతుకుతుంది."

పిక్చర్ ఫెయిలయినందుకు, ఇప్పుడు పాండు చెప్పిన కారణాల్నే తనుకూడా ప్రచారంలోకి తీసుకొనిరావాలని సంవత్సరంనుంచీ ప్రయత్నిస్తూనే వున్నాడు ; కాని తాను

ఆ ప్రచారాన్ని విజయవంతంగా జరిపించాలనే నమ్మకం తనకు ఏనాడూ కలగలేదు. ఎందుకంటే ఫెయిల్ ఐన పిక్చర్లో పనిచేసిన ప్రతివాళ్లూ, తనుతప్ప, మిగతావాళ్లంతా ఆ ఫెయిల్యూర్‌కు కారణభూతులనే ప్రచారాన్ని సాగిస్తూనే వుంటారు—విజయవంతమైన పిక్చర్‌కు తానే కారణమనే ప్రచారాన్ని సాగించినట్లు! తన పద్ధతే మిగతావాళ్ళు కూడా అవలంబించటంవల్ల, ప్రజలు ఎవ్వరిమాటా వినకుండా పోయ్యారు...పోతే యిప్పుడు యీ పాండు మాటలధోరణి చూస్తే నిజంగానే తను తప్ప, తనతో పనిచేసిన యితరులే పిక్చర్ ఫెయిలయినందుకు కారణమనే నమ్మకం తనలో గాఢంగా నాటుకుంది.

"నీవన్నమాట నిజంకూడాను" అన్నాడు గోపాలం; యే కలలోనన్నా పాండు నమ్మకం చెడుతుందేమోనని అతని భయం.

"ఏతావాతా యీ పెట్టుబడివాణ్ణి మనం సద్వినియోగంచేసుకోవాలి. రేపుఉదయమే అతన్ని నీ దగ్గరకు తీసుకొస్తాను. తెల్లారేలోగానే మన సమావేశం జరిగితీరాలి కనుకనే యిప్పుడు పరుగెత్తుకొచ్చాను" అన్నాడు పాండు.

మర్నాటి సమావేశం తనయింట్లో జరిగేందుకు వీల్లేదు; అసలు పేరుకు ఇల్లేకాని తనువుండేంత దుకే ప్రస్తుం ప్రాప్తిలేదు.

"సమావేశం ఎక్కడ?" అన్నాడు గోపాలం.

"ఇక్కడికి తీసుకొనిరానా ?"

"వొద్దు. ఆయనదగ్గరకే వెళ్దాం..."

"సరే, ఐతే మరీ మంచిది. తనను గౌరవించినట్లే భావిస్తాడు. పొద్దున్నే వొస్తాను ! మరి—" అని పాండు లేచి నిలబడ్డాడు.

"తెల్లారేందుకు మరి రెండు గంటలేవుంది. యీ రెండు గంటలూ ఇక్కడే పడుకుంటే ఉదయమే వెళ్ళొచ్చుకదా!" అన్నాడు గోపాలం.

"సరే ఐతే...డ్రైవర్‌కు చెప్పివొస్తాను."

ఇద్దరూ చెరోపక్కమీదా పడుకొన్నారు; లైటు అర్పి వేయబడింది. ఐదునిమిషాల్లో పాండు గాఢనిద్రకు వుపక్రమించాడు. కాని గోపాలానికి నిద్రపోవాలనిలేదు ; నిద్రరావటమూలేదు. అతని బుర్ర విపరీతమైన వేగంతో, పదునుగా పనిచేయసాగింది.

పూర్తిగా మునిగిపోయిన తనను యీ పాండువొచ్చి వొడ్డున పడేశాడు. ఈ సదవకాశాన్ని ఏవిధంగానూ వృథాపోనివ్వరాదు. పిక్చర్ సంగతి యెలావున్నా తనూ, పాండూ తగినంతగా పుంజుకోవాలి. ఇలాటి నిశ్చితాభిప్రాయాలే తెల్లారేదాకా అతని బుర్రలో చిందులు తొక్కినయ్.

# 2

షావుకారు సాంబయ్యకు మొదటి పరిచయంలోనే తనంటే మంచి అభిప్రాయం ఏర్పడటంతో, గ్రహాలు చాలా సానుకూలంగానే వున్నయ్యనే నమ్మకం గోపాలంలో దృఢపడింది. ఎక్కువ గాస్‌కొట్టనక్కర్లేకుండానే, మూడు రోజుల్లోగానే ఆఫీసుకు ఒక మంచి యిల్లు తీసుకోవటం, ఫర్నిచర్ కొనటం జరిగింది. తొందరపడి డబ్బేమీ అడగకూడదనుకున్నాడు గోపాలం. కాని గోపాలం అడగకుండానే సాంబయ్య ఐదువందలరూపాయిలిచ్చాడు. కొంత మొహమాటపెట్టాకనే గోపాలం ఆ పైకాన్ని అంగీకరించాడు. పాండు చెప్పిన మాటల్నిపట్టి సాంబయ్య వొట్టి అమాయకుడని గోపాలం అనుకున్నాడు ; కాని వారంరోజుల పరిచయంలోనే సాంబయ్యనుగూర్చిన అభిప్రాయాన్ని గోపాలం మార్చుకోక తప్పలేదు. సాంబయ్య మనుష్యుల విలువను కట్టటంలో సమర్థుడు ; యీ సూత్రం తనపట్లనే వర్తించటంవల్ల సాంబయ్యమీద అభిప్రాయం గట్టిపునాదితో దృఢపడింది. నిజానికి ఎక్కడన్నా తనకూ, పాండుకూ అభిప్రాయభేదం వొస్తే సాంబయ్య తనపక్షమే అవుతున్నాడు. దీన్నిబట్టి ఏళ్ళతగబడిగా తనకు తెలిసిన పాండువిలువా, వారంరోజుల పరిచయమున్న తనవిలువా సాంబయ్య బాగా గ్రహించగలుగుతున్నందుకు గోపాలానికి ఎంతో తృప్తి కలిగింది.

ముందు తను దొంగపిలోనుంచి బైటపడ్డాడు. సాంబయ్యకు సదభిప్రాయం కలగటమే గురిగా గోపాలం ప్రవర్తించ సాగాడు. ముందు యీ విధంగా నమ్మిచ్చి, తరువాత సాంబయ్యను కీలుబొమ్మను చేసుకోవాలని గోపాలం అభిప్రాయం. అందుకనే పదిరోజుల్లోగానే నిర్మలకుమారి స్నేహాన్నికూడా సాంబయ్య సంపాయించ గలిగాడు. నిప్పులాంటి సాంబయ్య యింత తేలిగ్గా లొంగిపోయినందుకు పాండుకూడా ఆశ్చర్య పోయ్యాడు. పట్టాలు తప్పకుండా సాగిపొయ్యే రైలుబండల్లే తాము వేసుకున్న ప్లాను సక్రమంగా సాగుతూన్నందుకు పాండు గోపాలాన్ని అభినందించాడు.

ఐతే గోపాలం దృక్పథంలో మార్పురాక తప్పలేదు. ముందుగానే యెగుడు దిగుడు వ్యవహారమని తోస్తే సాంబయ్య ఎక్కడ విరమిస్తాడోనని మొదటి నెలంతా అతని అడుగులకు మడుగులొత్తుతూ పది ఖర్చయేచోట ఐదే ఖర్చు చేయిస్తూ, ధనాపేక్ష తనకు చాలా దూరపుబంధువని సూచిస్తూ వొచ్చిన గోపాలం, మరి మారకుంటే అసలుకే మోసమని తెలుసుకోలేనంత మూర్ఖుడు కాడు; పరిపక్వదశ రానిదే పెడమార్గాలు ప్రమాదకరమౌతవనే సిద్ధాంతాన్ని అనుసరించి ప్రవర్తిస్తున్నాడు. పై లాంఛనాలూ యేర్పాట్లూ పూర్తయాక, ఆయుధాలు తీసుకొని ఆపరేషన్‌కు సిద్ధమయే డాక్టర్ స్థితికి వొచ్చాడు గోపాలం.

ఐతే అతని మొదటి ప్రయోగం సాంబయ్యపట్ల జరగ లేదు. అదు గనుకునా జాగ్రత్తగా ఆలోచిస్తూన్న గోపాలం గురితప్పకుండా దెబ్బ ఎటు పడాలో పరిశీలించగలిగాడు.

సాంబయ్య తనకు పరిచయమైంది పాండుద్వారా. తాను పాండుతో కలిసి చేయబోయ్యే సత్కార్యంపట్ల పాండు సగ భాగమూ ఉండనేవుంది. ఐతే చివరకు యీ అభాండమంతా తనవొంతే అవుతుంది. ఎందుకంటే పాండు కేవలం నిమిత్త మాత్రుడు అమాయకుడుగా, మధ్యవర్తిగా మాత్రమే సాం బయ్యకు అర్థమౌతాడు. ఏదెలా వున్నా యీ పీడంతా తన మీదినుంచే పోక తప్పదు.

ఐతే యీ గాయానికి తాను సిద్ధంగా ఉండటంతప్ప మరో మార్గం లేదు. కాని తనతోపాటే లాభాలు పంచుకునేందుకు సిద్ధమయ్యే పాండు, నష్టానికి ఏవిధంగానూ బాధ్యుడు కాక పోవటం చాలా అన్యాయమనిపించింది. చివరకు జరిగేది ఏమిటంటే సాంబయ్య, పాండూ ఒకటవుతారు; తానొక్కడే పరాయివాడు. లోపాయికారీ వ్యవహారమంతా సాంబయ్యకు తెలియదుకనుక, చివరిదశలో తెలియచెప్పటం ఎవడి శక్యమూ కాదుకనుక, తనకు చెడుపేరుమాత్రం స్థిరపడటం తథ్యం.

ఈ పరిస్థితుల్లో పాండు చాలా అనవసరంగా కనిపిం చాడు. ఒకవిధంగా పాండు తనను పైకి తీసుకొచ్చేందుకు కారణభూతుడైనప్పటికీ, చివరకు తన పతనానికికూడా

కారణభూతుడు అవకపోడు. అదీగాక మనుషుల తత్వాలు ఎప్పుడు మారినా మారవచ్చు. పాండు మనస్సుకూడా మారిందంటే, సాంబయ్య మనస్సుకూడా మారవొచ్చు; కనీసం తను పాండుకు ఏదన్నా వ్యతిరేకంగా చేసినట్లయితే, అది తనకూ సాంబయ్యకూ మధ్య అగాధాలను తవ్వేందుకు సహాయపడుతుంది.

దూరం ఆలోచిస్తే తను ఎవరికి అనుకూలంగా ప్రవర్తించాలనేది కూడా తెలియదు. అభిప్రాయ భేదాలంటూ వొచ్చేట్లయితే తనుకనక పాండుపక్షం వహిస్తే—పూర్వపు గతే పడుతుంది. ఏనాటికైనా తాను సాంబయ్యను నమ్మటమే జరిగితీరాలి!

ఇందులో పుంజుకునే తృణానికో వేరొక భాగస్థుడాయె! స్వతంత్రించి తాను చేసేందుకు వీలులేకుండా యీ భాగస్థుడు అడ్డుపడుతూంటాడు. ఎప్పటికైనా యీ భాగస్థుడితో పేచీ రాకమానదు.

అలాటప్పుడు పేచీ వొచ్చినప్పుడు తను ఇరుకున పడతాడు. కనుక ఆ రాబొయ్యే పేచీని ఇప్పుడే రప్పించి గాలి తనకు అనుకూలంగా వుండేట్లు చేసుకోవటం అత్యవసరం! తన స్వార్థంకోసం పాండు సాంబయ్యను ముంచేందుకు సిద్ధపడ్డాడు. అలాటప్పుడు తను పాండును ముంచటం ఏ విధంగానూ అన్యాయంకాదు; ఆ తరువాత సాంబయ్య మునగటం ఎటూ రాసిపెట్టేవుంది కనుక, తనెలాగూ రక్షించలేడు.

ఇప్పుడిప్పుడే కొత్తఆఫీసుకు తిరణాల చిహ్నాలు ఏర్పడి నవ్. మొదటి పిక్చర్ రిలీజయ్యాక తలెత్తుకోలేని తను, బుష్‌కోట్లువేసి పాండీ బజారులో డైరెక్టర్లతో తిరుగులాడుతూ వున్నాడు. డైరెక్టర్ హోదాలోనే సినీమాజనంకూడా తనను పలకరిస్తున్నారు. అప్పుడే చాలామంది శిష్యులయ్యారు......ఈ వేడిలోనే తాను స్వాతంత్ర్యం సంపాయిస్తే మిగతా సమస్యలన్నీ తీరిపోతాయ్. సాంబయ్య ఎట్లాగూ నిర్మలకుమారి ప్రేమపాశంలోంచి బైటపడే స్థితిలో లేడు కనుక, తన యేకైక శత్రుడు పాండునొక్కణ్ణే వొదిలించుకోవాలి.

ఎక్కువ రభస కాకుండా ఈ వ్యవహారాన్ని పరిష్కరించే పద్ధతికూడా గోపాలం ఆలోచించాడు. అబద్ధాలు ఎక్కువ చెప్పకుండానే, అసలు పాండు ఏ వుద్దేశంతో సాంబయ్యను ఇక్కడికి తీసుకొనివొచ్చాడో, తనతో ఏవిధంగా సంప్రతించి పన్నాగం పన్నాడో సాంబయ్యకు తెలియచెపుతే, తన ప్రమేయంలేకుండానే సాంబయ్యే పాండుకు ఉద్వాసన చెపుతాడు. దుష్కృత్యాల్లో భాగస్వాములు ఉండటం ఎప్పుడూ ప్రమాదకరమే అవుతుంది కనుక, ఆ తరువాత తానొక్కడే చివరిదాకా కళ్ళాల్ని పట్టవొచ్చు.

నాలుగైదుసార్లు వెళ్ళేనేకాని సాంబయ్య నిర్మలకుమారి ఇంట్లో ఎప్పుడూ 'బిజీ'గానే ఉండటం మంచి శుభలక్షణం గానే గోపాలానికి తోచిందికాని, తనతో మాట్లాడే తీరిక

కూడా లేకుండటం కష్టమనిపించింది, ఐతే ఉత్తరోత్రా ఈ పద్ధతి చాలా అనుకూల వాతావరణానికి తోడ్పడుతుందనే తృప్తి గోపాలానికి లేకపోలేదు.

"చాలా అర్జంటుపనిమీద వొచ్చాను-" అన్నాడు గోపాలం.

"డబ్బేనా?" అన్నాడు తొందరను సూచించే కంఠస్వరంతో సాంబయ్య.

"కాదు—" అని గోపాలం అన్నతరువాతనే సాంబయ్య స్తిమితంగా కూలబడ్డాడు.

"ఏం లేదు. మీ మేలుకోరి, కొన్ని రహస్యవిషయాలు తమకు చెప్పేందుకు వొచ్చాను—"

"చెప్పండి"

ఆ తరువాత ఆ రాత్రి పాండు తనను కలిసినప్పటినుంచీ ఈనాటివరకూ జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పాడు గోపాలం. ఐతే పాండుతో తనుకూడా మొదట్లో చేతులు కలిపిన వ్యవహారాన్ని మాత్రం చాలా జాగ్రత్తగా, తన మీదేమీ నెపం లేకుండేట్లు అర్థంచేయాలని విశ్వప్రయత్నం చేశాడు. అంతా వింటూన్నంతసేపూ సాంబయ్య అదిరిపోతాడనీ, ఈ కుట్రకు వొణికిపోతాడనీ అనుకున్న గోపాలం డిసప్పాయింట్ అయ్యాడు. ఆ జరిగే కుట్ర మరెవరిమీదనో అన్నట్లూ, ఒక కథను వింటూన్నట్లే ప్రవర్తించాడు సాంబయ్య. సాంబయ్య ఈ మొత్తం వ్యవహారాన్ని ఏవిధంగా

తీసుకున్నాడో, అతని అభిప్రాయమేమిటో వినటం ఒక్కటే గోపాలానికి మిగిలివుంది.

"ఐతే మొదట్లో పాండూ, మీరుకూడా నన్ను ముంచేందుకు ఒప్పుకున్నారన్నమాట ?" అన్నాడు సాంబయ్య.

"మీరు యీ ప్రశ్న తప్పక వేస్తారని నాకు తెలుసు. పాండు నా మిత్రుడు. ఒక రకంగా మిత్రుడికి వుపకారం చేద్దామని మొదట్లో అనుకున్నాను..."

"మరి యెందుకు చెయ్యలేక పోయ్యారు ?"

"ఎట్లా ? మొదట్లో మీరు పరాయివాళ్ళే అనుకోండి. ఆ తరువాత మీరుకూడా మిత్రులయ్యారు. ఒక మిత్రుడు వేరొక మిత్రుణ్ణి, తన స్వార్థానికి బలిచేసుకోవాలని చూస్తుంటే, మిత్రభావంవున్న నాలాంటివాడు దాన్ని సహించగలడా?" అన్నాడు గోపాలం.

"ఐతే మీరు నెలరోజులుగా యీ సంగతి ఎందుకు చెప్పలేదు ?" సాంబయ్య లేచి హాలులో పచార్లు ప్రారంభించాడు. అతని మనస్సులో కొంత అశాంతి బయలు దేరిందని అర్థంచేసుకోగలిగిన గోపాలానికి ఆ అశాంతిని విజృంభింపచేయాలనే కర్తవ్యం కళ్ళముందు ఆడింది.

"నిజంచెప్పాలంటే మనకు పరిచయమైన మొదటి గంటనుంచే యీ కుట్రను తమకు చెప్పే అవకాశంకోసం తహతహలాడిపోతున్నాను. కాని ఆ అవకాశం యీనాటివరకూ లభించలేదు"

"అంటే పాండుకు తెలియకుండా నాదగ్గరకు రావాలని ప్రయత్నించారు—అంతేనా?"

"అదేకాదు. నేను చెప్పేమాటలమీద మీకు గురి వుండాలి. అంటేనామీద కొంత సదభిప్రాయం మీకు కలిగే దాకా, యీ గూడుపుఠాణి మీతో చెప్పినా ప్రయో జనం వుండదు. మీకూ పాండుకూ యెంతో స్నేహంకదా! నేనేకదా దూరమైనవాణ్ణి. నన్నుకూడా మీరు నమ్మికలోకి తీసుకోందే, నేనుచెప్పే విషయాల నిజమైన విలువ అర్థం కాదు—"

"ఓహో!" అన్నాడు సాంబయ్య. "ఐతే యిప్పటికి మీకానమ్మకం కుదిరిందన్నమాట? కాని మీరు చెప్పిన విషయాలన్నీ నేనిప్పుడు నమ్మాను అనుకోండి—?" సాంబయ్య గోపాలం మొహంలోకి తీక్షణంగా చూశాడు; ఆ వేడికి గోపాలాన్ని ఆవరించిన మంచంతా చప్పున కరిగిపోయింది. ఏం మాట్లాడాలో తెలియక, స్వైరై ఒక నిమిషంపాటు తెల్ల బోయ్యాడు.

అంటే పాండుమీద ఏ అభిప్రాయాన్నయితే సాంబయ్యకు కలిగించాలని తాను ప్రయత్నంచేశాడో అదే అభిప్రాయం తనకుకూడా వర్తించిందన్నమాట! పాండుమీద సాంబయ్య ప్రస్తుత అభిప్రాయమేమిటో తనకు సరిగ్గా తెలియదు; ఆ సంగతి సాంబయ్య చెప్పలేదు. పైపెచ్చు తన మాటల్ని నమ్మననే అభిప్రాయాన్ని సాంబయ్య బైటపెట్టాడు కనుక,

తనపట్ల అతని అభిప్రాయం స్ఫటికమంత స్పష్టంగా తేలిపో యింది. కథ ఇలా అడ్డంతిరుగుతుందని తనకు సూచనప్రా యంగా తెలిసినా, పాండునే భాగస్వామిగా వుంచుకొని తంటాలు పడేవాడు. ఐనా తన పట్టువీడక, గోపాలం గుంజు కోసాగాడు.

"మీరు నమ్మండి......నమ్మకపొండి......యదార్థం చెప్పాను. మీ మంచితనానికి, అమాయకత్వానికి—దెబ్బ తగులుతుందేమోననే భయంతో, మీకు అపకారం జరగ కూడదనే భావనతో యిదంతా చెప్పాను" అన్నాడు గోపాలం.

"పోనీ యిదంతా నిజమే అనుకుందాం" అన్నాడు సాంబయ్య "అప్పుడు మీ విశ్వాసపాత్రత మాత్రం యే ముంది చెప్పండి—"

"అంటే ?" అన్నాడు గోపాలం అర్థంగాక.

"పాండు మిమ్మ యెంతో నమ్మాడు; నన్ను ముంచేందుకే అవుగాక మీతో చేయికలిపాడుకదా ! యిప్పుడు అతనికి జరి గిన అపకారం చూశారా ?"

"మీ ఉద్దేశం—నేను ఈ దుష్కార్యంలోంచి బైటికి వొచ్చాననా ?"

"దుష్కార్యం సత్కార్యం కాదయ్యా ! నిన్ను నమ్మిన మిత్రుణ్ణి ఏం చేశావు ?"

"మీకు టోపీపెట్టటంలో నేను అతనితో కలవలేదనా మీరు నేరం మోపటం?" అన్నాడు గోపాలం ఆశ్చర్యపోతూ.

"ఏదైనాకానీ ..నాకుటోపియో-వేరొకరికి టోపియో-నీవుమాత్రం మిత్రద్రోహం చేశావనేది తేలిపోయింది"

"కాని మీరు ఈ సాలెగూడులోనుంచి బైటపడేందుకు నేను చేసిన ప్రయత్నమో?

"కావొచ్చు, కాకుల్ని కొట్టి గద్దలకు వేయటం ఎంత ధర్మం? నిన్ను నమ్మిన మిత్రుడికే ఇలా చేశావ్ కదా! అలాంటి నిన్ను నేనుమాత్రం ఎలానమ్మేదీ? రేపు నాకుమాత్రం ద్రోహం జరగదనే నమ్మకం ఏమిటి? పాండు నైజంతో పాటు నీ నైజం కూడా బైటపడింది—"

సాంబయ్య ఇంత లోతైన మనిషని గోపాలం ఇప్పుడే తెలుసుకున్నాడు. లోతు తెలియని నీళ్ళలోకి దిగి, తీరా ప్రవాహం మధ్యంలో ఇరుక్కుపోయినట్లయింది అతని పని. ఐనాపర్యవసానంకోసం గోపాలం కాచుకొని కూర్చున్నాడు.

"ఏమైనాకానీ...నాకీ వ్యవహారాలు ఏమీ బాగాలేవు. నెలరోజుల్నుంచీ రెండు వేలదాకా ఖర్చయింది. దానికి నాకేం బాధలేదు. ఈ రెండువేలతోనే, రెండు లక్షలు పెట్టి పిక్చరు తీసినంత అనుభవం వొచ్చింది..." అన్నాడు సాంబయ్య.

"అంటే మీరు వ్యాపారంనుంచి విరమిస్తున్నారా?" అన్నాడు గోపాలం జారిన గుండెల్తో.

"ఆం. మూడేళ్ళక్రితం నా భార్యపోయింది. అప్పటి నుంచీ పోయింది. అప్పటినుంచీ మనశ్శాంతి లేకనే ఏ వ్యాపారాన్నీ తలపెట్టలేదు. పోనీ యీ వ్యాపారంలోనన్నా మనశ్శాంతి దొరుకుతుందేమోనని వొచ్చాను—"

ఏమిటీ వెధవధోరణి అనుకున్నాడు గోపాలం; మనశ్శాంతికీ వ్యాపారానికీగల సంబంధం ఏమిటో అతనికి అంతుబట్ట లేదు.

"కాని రెండువేలతోనే మనశ్శాంతిని కొనుక్కోగలిగాను. ఇంత చౌకగా మనశ్శాంతి దొరుకుతుందని నేను ఎన్నడూ తలవలేదు. రెండు లక్షలు ఖర్చయ్యేచోట రెండు వేలే ఐం దంటే లక్షా తొంభై ఎనిమిదివేలు ఆదా! ఏ వ్యాపారమూ చేయకుండానే నేను ఇంత డబ్బు సంపాయించానన్నమాట! దీనికి ఆదాయపు పన్ను బాధకూడా లేదు"

తనకు తెలియని భాషేదో వింటూన్నట్లుంది గోపాలానికి.

"ఐతే అసలు పిక్చరే తీయరా?" అన్నాడు గోపాలం సూటిగా.

"పిక్చరు తీయటం మానుకొని ఇరవై రోజులైంది—"

గోపాలానికి అంతా అగమ్యగోచరంగా ఉంది. తనకన్న ఘనుడెవడో వొచ్చి అసలు రహస్యాన్ని ఇరవై రోజుల క్రితమే సాంబయ్యకు వూదాడేమోననే అనుమానం అతన్ని వేధించసాగింది.

"నాకు అర్థంకాలేదు—"

"చెప్పానుకదా—నేను వ్యాపారం చేసేందుకు నిశ్చయించుకొన్నది మనశ్శాంతికని! అది ఇగవై రోజులక్రితమే దొరికింది. మిగతాలోకం ఎట్లాపోయినా నాకు పట్టదు. ఈ గూడుపురాణీలనుగూర్చి విని, ఆలోచించే తీరిక నాకులేదు!—

"అంటే?"

"మిగతా విషయాలు, మీ నిర్మల కుమారి చెపుతుంది" అని, గోపాలాన్ని మూర్ఛబోయ్యే స్థితిలోనే వొదిలేసి సాంబయ్య ఇంట్లోకి వెళ్ళిపోయ్యాడు. గోపాలం మూర్ఛలోంచి తేరుకునేప్పటికి నిర్మలకుమారి ప్రత్యక్షమైంది...తనూ పాండూ కాకుండా, తామిద్దరికీ ఈ నిర్మలకుమారికూడా పోటీగా వున్నదనే మెరుపులాటి తలపు గోపాలానికి కలిగింది. ఎలదుకంటే యీ ముగ్గురూకూడా ఏదో విధంగా సాంబయ్యను పీడించేందుకు సిద్ధమైన జలగలేకదా!

"ఐతే సాంబయ్యగారి మనస్సు విరిచేయగలిగావన్న మాట?" అన్నాడు గోపాలం ఉక్రోషంతో.

"కాదు...నా మనస్సునే సాంబయ్యగారు విరిచేశారు"

ఇన్ని ఏంటీ క్లయిమాక్సులున్న కథను గోపాలంఎన్నడూ ఊహించలేదు; నిత్యజీవితంలోనే అనుభవించాల్సివొస్తే మనిషి తలక్కిందులుకాకుండా ఉండగల గుండెధైర్యం గోపాలానికి లేదు.

"ఏమిటి నీవనేది?" అన్నాడు గోపాలం.

"నాకు సినిమాపిచ్చి మరిలేదు. సాంబయ్యగారి పరిచయం... కాదు ... స్నేహంతో నాకు జ్ఞానోదయమైంది

స్త్రీవలె జీవించటం ఒక్కటే నాకు మిగిలివుంది. అప్పుడీ బాధలూ, యెండమావులూ, అశాంతులూ వుండవు—' అంది నిర్మలకుమారి.

ఏదో నాటకంలో వినే సంభాషణల్లాగు వున్నయ్ గోపాలానికి. మనుషులు సూటిగా యెందుకు మాట్లాడరో, ఎక్కడో మొదలుపెట్టి మరెక్కడికో లాక్కునెళ్ళేందుకు యెందుకు ప్రయత్నిస్తున్నారో అతనికి ఆశ్చర్యంగావుంది.

''ఏం చేయబోతున్నావు?'' అనగలిగాడు గోపాలం.

''సాంబయ్యగారిదగ్గర శాశ్వతంగా వుండబోతున్నాను'' అంది నిర్మలకుమారి.

''అంటే సాంబయ్యా, నీవూ కలిసి...''

''అన్నమాటే!''

''అది కాదు...మీరిద్దరూ కలిసి నన్నూ, పాండునూ యెటూ కాకుండా చేశారన్నమాట!'' అన్నాడు గోపాలం. ఇంతకు ముందులేని సానుభూతి పాండుపట్ల గోపాలానికి కలిగింది.

''ఈ అర్థాలన్నీ నాకు తెలియవు. సాంబయ్యగారికి నాకూ మనసులు కలిసినయ్. ఒకరికొకరు మనశ్శాంతిని ఇవ్వగలమని రుజూఐంది. ఆయనకు వ్యాపారమూ అక్కర్లేదు, నాకు సినిమాలూ అక్కర్లేదు. పైవారంలో మేము బందరు వెళ్తున్నాం'' అని హేళనతో కూడిన చిరునవ్వు వొలకబోసింది.

"స్వార్థపరులు!" అన్నాడు గోపాలం పళ్ళు కొరుకుతూ.

"ఎవరిస్వార్థం వాళ్ళకుఫుంది...తక్కువతిన్న దేవ
రులే!" అని తిప్పికొట్టింది నిర్మలకుమారి.

ఆ ప్రదేశంలో మరి క్షణంకూడా నిలబడలేక గోపాలం
బైటపడ్డాడు. మర్నాడు ఉదయం తోకలు తెగిన నక్కలు—
పాండూ గోపాలం పాండీబజారులో తమ భావిజీవితాన్నం
తన్నిట్నే మట్టిపాలు చేసిన సాంబయ్యనూ, నిర్మలకుమారినీ
గూర్చి దుమ్మెత్తి పోయసాగారు—

కాని వీళ్ళ ప్రచారాన్ని వినేతీరిక లేని సినిమాజనం తమ
పనులమీద సాగిపోతూనేవున్నారు. చివరకు నోళ్ళునెప్పులు
పుట్టి మరికొన్నాళ్ళపాటు అజ్ఞాతవాసంలో విశ్రాంతి తీసికు
నేందుకు గోపాలమూ, పాండూ నిశ్చయించుకున్నారు; వీళ్ళ
నిశ్చయం వాళ్ళకేగాక, చాలామంది సినిమా జనానికికూడా
ఆరోగ్యకరంగా పరిణమించిందని వాళ్ళను ఎరిగివున్న వాళ్ళం
దరికీ తెలుసు!

— జూలై, 1953

# గురిగింజ

సావిత్రి తీవ్రంగా, దీర్ఘంగా ఆలోచిస్తూవుంది. గతమూడు, నాలుగు గంటలనుంచీ ఎంత ఆలోచించినా ఆమె ఒక నిర్ణయానికి రాలేకపోతోంది. వాతావరణంలో గాలి చేసేచిన్న శబ్దం మినహాగా, మరి ఏ ఇతర అలికిడి లేనప్పటికీ, ఆమె తన పనిలో కలకలం ఆమెను ప్రశాంతంగా ఉండనివ్వటం లేదు. క్షణక్షణానికీ ఆమెను విసుగు, కోపం, చిరాకు అధిక పరిమాణాల్లో ఆవరిస్తూనే ఉన్నవి.

గోడవతలనుంచి పెద్దకేక వినిపించింది.

"శ్రీపతీ! శ్రీపతీ!"

తిరిగి కేకలు వినిపించినవి. సావిత్రి నిశ్చలత్వం భగ్నమైంది. కాని ఆమె జవాబు చెప్పలేదు; చెప్పదలచుకో లేదు—ఎందుకంటే యీ సమయంలో ఆమె దేని వైపూ దృష్టిని మరల్చలేని స్థితిలోవుంది; యీ కేక ఆమెకు మరింత చిరాకు తెప్పించింది. విసుగ్గా రెండోవైపుకు తిరిగి పడుకుంది.

బైటి వ్యక్తిపట్టువిడవకుండా మరి రెండుసార్లు కేక వేశాడు. యీ సారి అతనికి కావలసిన వ్యక్తి నిద్రనుంచి మేల్కొన్నాడు. వీధి తలుపు తెరిచిన చప్పుడైంది. సావిత్రి

పెడద వొదిలినట్టు; నిశ్చింతగా నిట్టూర్చింది... కాని ఆమె తలచిన ప్రశాంతత భగ్నంగాక తప్పలేదు. అవతలి మాటలు చాలా స్పష్టంగా వినిపిస్తున్నవి.

"కాస్త అట్లా వెళ్లామా—రహస్యం మాట్లాడాలి"

"ఎందుకురా—ఇక్కడ మాట్లాడు... అంతా నిద్ర పోతున్నారులే" అన్నాడు శ్రీపతి.

అవతలి వ్యక్తి కంఠాన్ని సావిత్రి గుర్తించకపోలేదు. తన అన్న బాల్య స్నేహితుడు దాసు.....వీడికి యీ అర్ధరాత్రి పూటతప్ప తీరలేదు కాబోలు! మొగాళ్ళకు యీ రహస్యాలు మాట్లాడుకు నేందుకు వేళా పాళా వుండదు! విశేషించి యీ సమావేశం కేవలం తన మనసును పాడు చేసేందుకే దాప రించినట్టుంది.

"సిగరెట్ కాల్చు".

కాస్సేపు మాటల్లేవు. తాపీగా సిగరెట్లు పీలుస్తున్న ట్టున్నారు! నిశ్శబ్దంగా వున్నప్పటికి సావిత్రి మనస్సు పని చెయ్యటం లేదు. ఆ సంభాషణేదో తన ఏకాగ్రతకు భగ్నం చేస్తుందని ఆమె వూహించింది. ఆవిధంగా భగ్నమయేం దుకు, ఒక విధంగా తయారయిందని కూడా చెప్పొచ్చు. అందుకని, ఆమె మనస్సు బలవంతాన ఆ రాబోయ్యే సంభా షణ పైనే మళ్ళివుంది.

"చెప్పరా" అన్నాడు శ్రీపతి.

కొంచెంసేపు నిశ్శబ్దం...ఆ చెప్పబోయేది ఎలా చెప్ప టమా అనే ఆలోచనలో పడ్డట్టున్నాడు దాను. చిన్న స్వరంతో ఆరంభించాడు.

“ఏంలేదురా — నారాయణరావు కూతురు—నిర్మల తెలుసురా—ఆ విధవ...దాని సంగతి”

“ఏమైందీ ?”

“ఏంలేదు. యీ మధ్య కాస్త సంబంధం కలిసిందిలే! ఆరు నెల్లవుతుంది. ఎట్లాగైనా సంసారాయె. అంత స్వేచ్ఛగా కలుసుకునేందుకు వీల్లేదా. ఏ అర్ధరాత్రి దాకానో కాపు వెయ్యాటం, చీకట్లో మొండిగోడ దూకటం, ఆమెకు సాధ్యమై, ఆమె ధైర్యంచేస్తే పిలవటం, కాకుంటే ఏ తెల్ల వారు జాముదాకానో కళ్ళల్లో వొత్తులు వేసుకొని, నిరా శతో కాళ్ళీడ్చుకుంటూ, నెత్తిన గుడ్డేసుకొని కొంపకు తిరిగి రావటం— ఇదీ అవస్థ! ఇకముందు, ఇదికూడా వీల్లేకుండా మీా దుకాణం కాస్తా పెద్దవాళ్ళ కళ్ళ పడింది. ఇన్సూర్ చేయని యీ శరీరానికి అపాయం కలక్కుండా బైట పడ్డా ననుకో! కాని తలచుకుంటే కంపరంగావుందిరా! ఇది జరిగి నెల్లాళ్ళు పైగా అవుతుంది. అప్పట్నుంచీ ఆ వైపు వెళ్ళ టంలేదు......”

యీ సువార్తకోసమేనా అర్ధరాత్రి పనిగట్టుకొని వీడు వొచ్చింది? సావిత్రికి వొళ్ళు మండింది. యీ వెధవ ఆలో చనల కోసమే కాబోలు—మొగాళ్ళు రాత్రంతా వూరి

మీాదికి బలాదూర్లకు వెళ్ళటం! ఇట్లాక్కాదూ సంసార స్త్రీల పరువు ప్రతిష్ఠలు బజారుకెక్కటం! ఐనా మధ్యలో ఆ పాడెందుకా అనుకుంది సావిత్రి. కథ సాగించమనే సావకాశం తనకులేదు. ఐనా మరి చెప్పకుండా దాసును ఆపగల సామర్థ్యంకూడా ఎవరికి ఉండదు; ఎందుకంటే, ఎలాగూ చెప్పేసేందుకనే వొచ్చాడు.

"మంచిపని చేశావ్ రా. కనుక బుద్ధి కలిగి ఇక ఆ ఛాయలకే పోవోక" అన్నాడు శ్రీపతి.

"నాకు నసాళం అంటింది. యీా ప్రణయఘట్టం ఇంతటితో వొదుల్తే నేను అదృష్టవంతుణ్నే. కాని నిర్మలమాత్రం నన్ను వొదిలేట్టులేదు—రోజూ ఉత్తరాలే! తనను చావబాదినా, నాపేరు చెప్పలేదట! నన్ను కలుసుకోవాలంటుంది; తన ప్రాణాన్నయినా వొడ్డుతానంటుంది. నాకు మాత్రం..."

"నీ అవస్థ నాకు తెలుసులే! ఒరేయ్! యీా ప్రేమ గీమా అట్లావుంచరా. కాని యీా సారిమాత్రం దొరికావంటే, సున్నంలోకి బొమికె వుండదురా!"

"నాకు తెలుసురా! యీా సంసార స్త్రీల జోలికి పోవటమంటే నా అవస్థలో పడ్డాక కాని బాగా తెలిసిరాదురా! అరేయ్! వాళ్ళవాళ్ళు దాన్ని చితకబాడిచారా— దానికి బుద్ధొచ్చిందేమోచూడరా! నేనంటే పడి ఛస్తానంటోంది. మొగాళ్ళమా—మనకులేని గుండె వీళ్ళకెట్లావొచ్చిందిరా!

దాని ప్రేమకు నేనెప్పుడో సలాంచేశాను. ఇదివరకు వాళ్ళ
వాళ్ళంటేఎంతో భయపడేదిరా! వాళ్ళ్ని కలిపించుకొని,
ఆమెకు బడితె పూజచేశాక— ఎక్కడి ధైర్యమోకాని,
మొగాణ్ని నేను సిగ్గుపడేట్టుగా ఉత్తరాలు రాస్తుందిరా!"

"అంతేరా ఆడజాతే అంత! ఆడది తెగిస్తే మనం పనికి
రామురా! దానిశక్తి దానికి తెలియనంతవరకే అది మని
షిరా! ఆ శక్తిని అర్థమయ్యేట్టుచేశామా అది తిరగబడు
తుంది; తిరగబడిందా—మనం చిత్తు కావాల్సిందే!...
అది ఏంరాస్తేనేరా—నువ్వు మెదలకుండా వూరుకుంటే సరి
పోతుంది!"

వీళ్ళ మాటల ధోరణిని అతి జాగ్రత్తగా అనుసరిస్తూనే
వున్న సావిత్రికి మొగాడి ప్రవర్తన ఎంత నీచంగా వుం
టుందో అర్థమైంది. ప్రణయభిక్షకోసం ముందడుగు వేసే
మొగాడు తీరా ప్రణయరంగంలో ముందుగానే జారుకొని,
తన కసలు సంబంధమే లేనట్టు దూసుకునేందుకు ప్రయత్నిం
చటం లోకానికి కొత్తకాదు. ఒక మూల పడివున్న దాన్ని
రేకెత్తించటం, తీరా ఆమె తన సర్వస్వాన్ని త్యాగంచేసేం
దుకు సిద్ధపడినపుడు, ఆమె ప్రణయాన్ని నీచంగా చూసి—
తన వెంట పడినందుకు అసహ్యించుకోవటం యీ మొగ
జాతికి ఉగ్గుపాలతో పెట్టిందని ఆమె అర్థం చేసుకుంది. స్త్రీ
హృదయాన్ని అర్థం చేసుకునే ప్రయత్నమున్నా చేయలేని
యీ పురుషుల్ని ద్వేషించక, భూషించటమంటే స్త్రీకి

అలవికాని విషయమని, యీ పురుషులు ఎందుకు గ్రహిం
చరో ఆమెకు అర్థమవలేదు. పైగ తన అన్నగారి సలహాలు
విని ఆమె మండి పడింది. మొగజాతే అంత అనుకుంది!

"నేను వూరుకున్నా, ఆమె వూరుకోవటం లేదురా
కొత్తల్లో పవిత్ర ప్రణయాన్నికూర్చి కొన్ని ఉపన్యాసాలు
దంచానులే! ఇప్పుడు వాటన్నిటినీ ఏకరువు పెడుతుంది.
నేనేం చేయమంటే అది చేస్తానంటుంది. ఏమీ చెయ్యొద్దని
రాద్దామనుకున్నాను. ఇక ఆ ఉత్తరాలు చూస్తే గుండె
తరుక్కుపోతుంది..."

"అందుకని సాహసించేవు రోయ్! వీపు చెడుతుంది"

"నాకు తెలియదట్రా! నా వీపు మీద నాకున్న ప్రేమ
కన్న, నీకు ఎక్కువ వుందా ఏరా! కాని ఆమె ఉత్తరాలు
చూస్తే నువ్వట్లా అనవురా! మొదట్లో ఎంతో అమాయ
కంగావుండేది. ప్రణయంలో ప్రవేశించాక కావ్యాలు రాయ
గల సామర్థ్యం ఆమెకు వొచ్చింది. ఆ సౌందర్యరాశికోసం
నేను పడ్డశ్రమ, పడిననష్టం—వీటికి తగిన ప్రతిఫలం ముట్టనే
లేదు. ఏంచేస్తాన్రా— అంతలో నీళ్ళధార వొదులుకోవల్సి
వొచ్చింది"

"ఐతే ఇంత సమస్యేం వుంది—పోయి పడుకో"

స్త్రీ ప్రేమను ఎంత తేలిగ్గా లెక్క కడతారో వీళ్ళు!
ఆమె ఎంత హృదయ పూర్వకంగా, తనను తాను అర్పించు
కున్నా, ఆమె ప్రణయాన్ని ఎగతాళిగా చూడటమే వీళ్ళ

విశాలత్వంకాబోలు! ఇవి ఆమె వెనుక మాట్లాడేమాటలు—ఇక ఆమె ముందు తేనెలొలికే పలుకుల్ని కవిత్వాన్ని వర్షించటం చేత నవ్వు వీళ్ళకు. పాపం ఆ అమాయకురాలు, నిర్మల యీ దాసుగాడివల్లో చిక్కుకుంది. ఆమెను ఎంత ఉద్రేక పరిచాడో, ఇప్పుడంత ఎగతాళి పట్టిస్తాడు—'నీచులు—యీ మొగాళ్ళు' అనుకుంది సావిత్రి.

"నేను వొదులుకున్నా ఆమె వొదులుకునేట్టు లేదురా! మొన్న వాకిట్లో పడుకొని వుంటే. వొక్కతేవచ్చి నన్ను లేపింది. అర్థరాత్రిపూట అరమైలు నడిచి వొచ్చిన ఆశక్తిని చూస్తే నాకు కంపరం ఎత్తింది. ఏవేవో మాటలు చెప్పి అప్పటికి వొదిలించుకున్నాను—"

"ఏమంటుందిరా?" అన్నాడు శ్రీపతి, త్వరగా తేల్చుమనే ధోరణిలో.

"ఏంలేదు. తనను పెళ్ళాడమంటుంది. మొదట్లో పెళ్ళి చేసుకుంటానని అన్నావే — ఆ ఉద్రేకంలో లక్షా తొంభై అంటాది. ఆ మాటలన్నిటినీ పాలించాల్సి వొస్తే మన శక్తి చాలుతుంది? ఇక్కడ ఎట్లాగూ సాధ్యం కాదనే విషయాన్ని నచ్చ చెప్పాను. ఐతే ఎక్కడికన్నా లేచి వెళ్ళి దంపతుల మవ్వుదామంటుంది. కావలసినంత డబ్బు తెస్తానంటుంది—"

"నువ్వేమన్నావురా?"

"డబ్బు ప్రస్తావన వొచ్చినప్పటినుంచీకాస్త రెప రెపలాడిందిరా! ఆమె మీద సన్నగిల్లిన ప్రేమ మళ్ళీ విజృంభించిందంటేనమ్ము నీ సలహా ఏమిటి?"

"అరేయ్—ఆమెను ఏలాగూ పేమించావు. ప్రేమతో పాటు డబ్బుకూడా వొచ్చి పడుతోంది; ఒకే దెబ్బకు రెండు పక్షులురాలినట్టు! నామాటవిని కొన్నాళ్ళపాటు దేశాంతరంలో గడిపి రండిరా! ఆ తరువాత మీ వివాహాన్ని ఎలాగూ వాళ్ళవాళ్ళు ఒప్పుకోక తప్పదు. ఒక్కగాని ఒక్కకూతుర్ని తోసి పుచ్చుతాడా? ఆ తరువాత ఆ ఆస్థంతా ఇటు కలుస్తుంది"

"నేనూ అదే అనుకున్నానురా! ఆమె చూపే ధైర్యం నాక్కూడా కొ స్త కొ స్త అంటుతోంది. యీ సమాజం మీద తిరగ బడాల్సిందేరా!"

"తప్పకుండాను. మనలాటి యువకులు ధైర్యం చెయ్యక పోతే మార్పులు రావటంకష్టం. వ్యక్తిగతమైన సమస్యగా కనిపించినా, ఇలాటిది సమాజానికి సంబంధించింది!"

"నేనూ అంతే ననుకున్నానులే...ఐతే రేపు రాత్రికే తరలి పోతాం"

"ఊఁ. నాకు చేతనైన సహాయంచేస్తాగా!"

"సరే వొస్తా—"

తలుపు మూసుకున్న చప్పుడు.

సావిత్రి దీర్ఘంగా నిట్టూర్చింది. వీళ్ళు ఎంత తెలివిగా, తమ స్వార్థం కోసమై దేకులాడుతూ, దాన్ని సమాజానికి అంటగట్టారో ఆమెకు అర్థమైంది. ఆ పిచ్చిది—నిర్మల ఎంత మోసానికి గురి కాబోతోందోకూడా సావిత్రికి అర్థమైంది. రేపే వెళ్ళి ఆమెను హెచ్చరిద్దామా అనుకుంది.

కాని వీళ్ళ సంభాషణ ఆమెను మరోవైపుకుకూడా లాక్కువెళ్ళింది. సమాజానికి తిరగబడటమనే విషయం మీద వాళ్ళిద్దరూ మాట్లాడిన మాటలు సహృదయంతోనైతే ఆచరించ దగ్గవే! వాళ్ళు చర్చించిన సమస్య, తమకు సంబంధించిందిగానే వాళ్ళు అపోహ పడ్డారు; కాని తన సమస్యకూడా అలాంటిదే! ఒక విధంగా తనకు దోవచూపారు!

తాను ప్రేమించిన రామ్మూర్తిలో యీ దాసుగాడిలాంటి నీచాభిప్రాయాలు లేవు. తమ ప్రేమలో డబ్బు ప్రస్తావనే లేదు కనుక, దాని రంగుమారే అవకాశం అసలేలేదు. ఒకరి కోసం ఒకరు త్యాగాలు చేయాల్సిన అవసరంలేదు. పోతే తన కోరిక నిర్బంధంగానే వుంది. విధవరికాన్ని అనుభవించటం అంత కష్టం కాదుకాని, పుట్టింట్లోనే వుండి అనుభవించటం మాత్రం నిజంగా నరకమే! నిర్మల దాసుగాణ్ని ఏం కోరిందో, రామ్మూర్తి తననూ అదే కోరాడు. ఆమె ఆ సమస్యను తేల్చుకోలేక వేగిపోతున్న సమయంలో- తన అన్నగారూ, దాసూ మధ్య జరిగిన సంభాషణ తనలో క్రొత్తఆశల్ని రేకెత్తించింది.

నెలల తరబడిగా తెగనిసమస్య కొన్నిక్షణాల్లోనే తీరింది. ఆమె ఒక నిశ్చయానికి వొచ్చేందుకు ఎక్కువ కాలయాపన జరగలేదు.

ఆమె పోతూ పోతూ అన్నగారికి ఒక ఉత్తరాన్ని రాసింది: "మొన్నరాత్రి మీరు సమాజంపట్ల యువకులు ప్రవర్తించాల్సిన విధానాన్ని గూర్చి చాలా బాగా చర్చించారు. ఐతే ఒక్క యువకులేగాక, యువతులుకూడా ఆ తిరుగుబాటులో పాల్గొన వలసిన అవసరం వుంది; ఆ సంగతి మీరు ఒప్పుకోలేకపోరు. మీ సంభాషణ నాకు నిజంగా జ్ఞానోదయాన్ని కలగ జేసింది. మీ యీ సలహాల్ని పాటించి, మీ మాటలమీద నేను చూపే గౌరవాన్ని మీరు అపార్థం చేసుకోరని నమ్ముతున్నాను...సావిత్రి"

తాను మహా తెలిగ్గా, ఏదో బైటవుండి, వాగిన వాగుడు విలువ, దాని శక్తి శ్రీపతికి బాగా అర్థమైంది. దాసుగాడికి చెప్పిన సలహాలు, తన చెల్లెలు లేచి పొవ్వోందుకు ఉపకరిస్తవని తాను అనుమానించి ఉన్నట్టయితే, అతని దృక్పథం వేరొక విధంగా మారి ఉండేది; కాని ఆ మార్పు రావాల్సిన సమయం దాటిపోయింది; చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే నేం, మానుతే నేం?

— జూన్, 1948

# సిద్ధాన్నం

ఈ వెధవవూరు వొచ్చాక వెంకట్రావుకు మతిపోయినట్లుగా వుంది—ఇక్కడ స్నేహితులు లేరనికాదు; పెద్దపెద్ద సినీమా హాల్సు, హోటళ్లూ లేవనీకాదు. ఇన్నాళ్ళూ పెద్దపట్టణంలో వుండి, యీ పట్టణమూ కాని, పల్లెకాని వూరనికాదు— ఇక్కడ జీవించటం ఎలాగో తెలియక !

అంటే వెంకట్రావు జీవనాధారం లేక, ఈవూరు వొచ్చిన వాడు మాత్రం కాదు, ఉద్యోగంలో ట్రాన్స్ఫర్ ఐ వొచ్చాడు. ఇక్కడి వాతావరణానికి అలవాటుకాలేక సతమతమౌతున్నాడు.

వెంకట్రావుకు పట్టుకున్నదల్లా ఆర్థికబాధే! ఏవిధంగా చూసినా తన జీతం చాలదు; అందుకని పైయెత్తున కాస్తో కూస్తో గుంజుకోవటానికి గత పదేళ్ళనుంచీ అలవాటుపడ్డాడు. ఐతే వెంకట్రావుకు నియమాలు అంటూ లేవేమోననేందుకు వీల్లేదు. ఎందుకంటే అతను నోరు తెరిచి ఎవర్నీ, ఎప్పుడూ, ఏమీ అడగలేడు. తను కష్టపడి పనిచేసి పెడతాడు: తన కష్టాన్ని గ్రహించి ఎదుటివాడు ఇచ్చే తృణమో పణమో తీసుకుంటాడు: తక్కువైందని అతనెప్పుడూ సణగలేదు.

ఐతే ఇక్కడి మనుషులూ, వాళ్ళ అభిరుచులూ, ఆచారాలూ మొదలైనవి తనకు ఎంతో కొత్తగా వుండటంవల్ల మొదటినుంచీ చాలా జాగ్రత్తగా వున్నాడు. ఎప్పుడో వొస్తుందికదానని, ఇప్పటినుంచే ఆ వొచ్చే దానిస్థాయిలో అనుభవించటం అవివేకమని వెంకట్రావుకు తెలుసు. అదీగాక, చేతిలో లేనిదే ఏం అనుభవించ గలుగుతాడు కనుక?

అందుకని ఖర్చులో ఇదివరకులాగు కాకుండా వొళ్ళు దగ్గర పెట్టుకొని వున్నాడు. నిజానికి యీవూరు వొచ్చాక అనేక సౌఖ్యాలను వొదులుకున్నాడు; ఏ విధంగానైనా సంపాదనకూ, ఖర్చుకూ సరిపెట్టుకుందామని ఎంత గుంజుకున్నా సాధ్యం కావటంలేదు. జీవితం చాలా అసంతృప్తికరంగా తోచింది. మరీ సంవత్సరాల తరబడిగా గడపిన జీవితస్థాయికి, ప్రస్తుత జీవితస్థాయికీ—కొండకూ, కొండకింది లోయకూ వున్నంత భేదంవుంది...తీపిపదార్థం తిన్నాక, సముద్రపునీళ్ళు తాగినట్లయింది—

ఈ సమస్యను భేదించేందుకు వెంకట్రావు గత రెండు నెలలనుంచీ తలబద్దలు కొట్టుకుంటున్నాడు. మొదట్లో ఆఫీసులో అందరూ తననొక వింతమృగమల్లే చూశారు. తనను వాళ్ళు గౌరవించక పోయినా తనను యేవగించుకునేట్లుగా ప్రవర్తిస్తారని అతను యెన్నడూ అనుకోలేదు. రైలుపెట్టెలోకి కొత్తగా ఎక్కినవాణ్ని తగినంత ఖాళీవున్నా అంతకు

ముందున్న ప్రయాణీకులు ఆహ్వానించక పోవటంలోగల
మనస్తత్వమే ఇక్కడా అతనికి ప్రత్యక్షమైంది.

రోజులు గడిచినకొద్దీ తనతోపాటే పనిచేసే ఇతర
గుమాస్తాలు తనతో కలిసిపోక తప్పదనే నమ్మకం వెంకట్రా
వుకు లేకపోలేదు. అతడు తలచిన విధంగానే వెంకట్రావుతో
మిగతావాళ్ళు కలవకపోయినా, వెంకట్రావే మిగతా
వాళ్ళతో కలిసిపోయి, కొత్తదనంలోని బాధ, ఒంటరితనం
లోనిభారం చాలావరకు వొదిలించు కున్నాడు.

యీ పరిస్థితి తెచ్చుకునేందుకు వెంకట్రావు చాలా
తంటాలుపడ్డాడు. గుమాస్తాలంతా తనను లెక్కచెయ్య
కుండా మూతిముడుచుకొని కూర్చున్నా, వాళ్ళ షేక్స్పియర్
మొహాలుచూసి తనమనసు మండిపడుతూన్నా పైకిమాత్రం
చిరునవ్వుతో వాళ్ళను పలకరించి ఎలాగో వాళ్ళదయ
కోసం పాకులాడి సాధించాడు. లౌకికవ్యవహారాల్లో యీ
రకం తెలివి తేటల్ని ఉపయోగించి కొంత నటించైనాసరే
పని గడుపుకోవటం వెంకట్రావుకు యీనాడు కొత్తకాదు.

ఐతే మిగతా ఉద్యోగులతోడి పరిచయం కొద్దిగా
స్నేహరూపందాల్చి, మరి పెరగకుండా అట్టే నిలచిపోయింది.
'ఓహో!' అనుకుంటే 'ఓహో' తోనే ఆగినదాన్ని వెంక
ట్రావు ఎంత ప్రయత్నించినా ముందుకు సాగించలేక
పోయ్యాడు. ఎన్నిసార్లు యీ ఉద్యోగులతో కాఫీహోటల్‌కు
వెళ్ళి, వాళ్ళబిల్స్ తాను చెల్లించినా మరి లాభంలేని పరిస్థితి

ఏర్పడింది. యీ విషయాన్ని గ్రహించాక వెంకట్రావు ఇక దమ్మిడీకూడా వీళ్ళకింద ఖర్చుచేయకూడదని నిశ్చయించుకున్నాడు; అసలు ఖర్చులు సరిపెట్టుకోవటం ఎలాగా అని ఛస్తున్న వెంకట్రావుకు ముందు యీ ఖర్చును తగ్గించుకోవటం అత్యావసరమైంది......

వెంకట్రావు ఆలోచనలు అన్ని వైపులకూ విస్తరించసాగినవి. సూక్ష్మంగా యీ సమస్యను ఛేదించటం కుదరనందువల్ల, ఇక్కడివాళ్ళ వింత మనస్తత్వం ఏమిటా' అని తీవ్రంగా ఆలోచించసాగాడు.

వొచ్చిన కొత్తల్లో అందరికీ నమస్కరించటం, ఏదో వాళ్ళదయవల్లనే తానిక్కడ పదికాలాలపాటు ఉద్యోగాన్ని చేసుకునేందుకు వొచ్చినట్లు సూచించటం మొదలైన నక్క వినయాలు ప్రదర్శించాడు కాని, అవి అంతగా ఫలించలేదు...ఇతర విధానాలుకూడా విఫలమైనవి. దీని కీలకం ఏమిటి?

తను రాకపూర్వం వాళ్ళెట్లా ఉండేవాళ్లో ఆ సంగతి తనకు అనవసరంకాని ఇప్పుడు మాత్రం ప్రతి ఒక్కడిక్కీ మిగతావాళ్ళంతా భయపడుతున్నట్లుగానే వుంటున్నారు. అంటే ఇందులో తన గొప్పాలేదు; మినహాయింపూలేదు. తను కొత్తవాడు కనుక, తను ఎలాంటివాడో తెలియక వీళ్ళంతా దూరదూరంగా వుంటున్నారేమోనని మొదట్లో తను అనుమానపడ్డాడు. కాని ఎన్నాళ్ళు జరిగినా తనను

కొత్తవాడుగానే వాళ్ళు పరిగణిస్తున్నారు. కాని ప్రతి వాక్యాన్నీ మిగతావాళ్ళంతా ఏదో అనుమానంతో, తమకు హానిచేస్తాడేమో ననే భయంతోనే చూడటంలో వెంకట్రావుకు కొంత తృప్తికలిగింది.

మరి యీ వింత మనస్తత్వమేమిటి? ఇదివరకు తను పని చేసిన ఆఫీసులో గుమాస్తాలు అంతా కలిసికట్టుగా ఉండే వాళ్ళు; ఎవరైనా తప్పుచేస్తే మిగతా అందరూకలిసి వాణ్ణి రక్షించేందుకు విశ్వప్రయత్నం చేసేవాళ్ళు. వారందరిమధ్యా ఐక్యతా, సానుభూతి కనిపించాలి. గుమాస్తా జీవితంమీద రోతపుట్టినా, ఆ కష్ట సుఖాలు తెలిసిన గుమాస్తాల సానుభూతి తనకు ఉండేది.

అసలు ఆ మాటకొస్తే ఆఫీసరు-హోదాకు ఆఫీసరే ఐనా గుమాస్తాలంటే ఎంతో దయగా ఉండేవాడు. గుమాస్తాతప్పు చేస్తే దాన్ని కప్పేందుకు ఆఫీసర్ కూడా తంటాలుపడేవాడు అన్యోన్యంగా వున్న కుటుంబంలోని వ్యక్తుల్లే హాయిగా వుండేవాళ్లు. ఎవరెంత సంపాయించుకున్నా, ఏడవటంలేదు.

నిజానికి ఆ ఆఫీసులోకూడా మొదట్లో తనను అంటరాని వాణ్ణిగా దూరానే వుంచారు. తనుకూడా వాళ్ళదగ్గర పెట్టు కొని పనిచేసేవాడు. ఎవరైనా తృణమో, పణమో ముట్ట జెపుతే తను అంగీకరించే వాడుకాదు...

వెంకట్రావుకు చాలా గొప్పగొప్ప ఆశయాలు ఉండేవి. ఉద్యోగంలో ప్రవేశించక పూర్వం 'లంచం' పట్టటాన్ని

అతను నిశితంగా విమర్శించేవాడు. లంచం పట్టకుండా మాడి చావటంలోనే గొప్పతనం వుందనీ, అదే దేశానికీ, ప్రజలకూ ఒక వ్యక్తి చూపగల త్యాగమనీ అతని నిశ్చితాభిప్రాయం-

కాని నిశ్చితాభిప్రాయాలనేవి ఏమనిష్కైనా వేళ్ళమీద లెక్కపెట్టేవిగానే వుంటవి. వాతావరణ మహాత్మ్యంవల్ల నిశ్చితాభిప్రాయం, కరిగి, తిరిగి గడ్డకట్టి వేరొక నిశ్చితాభిప్రాయంగా తయారవుతుంది. మొదటి నిశ్చితాభిప్రాయానికి రెండోదానికి పోలికే వుండదు—

వెంకట్రావు నిశ్చితాభిప్రాయంకూడా అలాగే మారిపోయింది. ఐదారునెలలు ఎలాగో ఓర్చుకొని తన ఆశయాన్ని పట్టుకొని వేళ్ళాడగలిగాడుకాని, ఆశయానికీ, యదార్థ జీవితంలోని కష్టానికిగల భేదాన్ని చూసేటప్పటికి, ఆశయం సడలనారంభించింది. తన ఈ విముఖత్వాన్ని మిగతా గుమాస్తాలు ఏవగించుకోసాగారు. తనను మరింత అంటరానివాడుగా దూరాన వుంచసాగారు. ఐనప్పటికీ వెంకట్రావు బాధపడలేదు. ఎందుకంటే తాను ఆశయంకోసం నిలబడగలిగాడు మిగతావాళ్ళందరికన్నా తన అధిక్యత స్పష్టంగా కనిపిస్తూనే వుంది. అందుకు తాను గర్వపడ్డాడు. విశేషించి తన ఈ పట్టుదలకు మిగతావాళ్ళు ఈర్ష్య పడసాగారు; వాళ్ళ యీర్ష్య తన గొప్పతనాన్ని మరింతచేసింది.

తను వొచ్చిన మొదట్లో అందరూ పత్తిత్తుల్లాగానే సంచరించసాగారు. ఎందుకనోకాని మొదటినుంచీ ఈ ఉద్యోగు

లందరూ దొంగలనీ, లంచగాళ్ళనీ వెంకట్రావుకు అనుమానం. తన అనుమానం యెంతవరకూ నిజమో తెలుసుకు నేందుకుగాను అతను ఒక్కొక్కరి ప్రవర్తనే జాగర్తగా కని పెడుతూవుండేవాడు. ఈవిధంగా తను కనిపెడుతున్నాడని మిగతావాళ్ళకు తెలిసి వాళ్ళూ తగిన జాగర్తలు పడ్డారు. 'లంచం' అనేమాట తామెప్పుడూ విననట్టే వాళ్ళు సూచించేవాళ్ళు. ఒకళ్ళిద్దరు లంచాన్నిగూర్చి, ఆ నీచత్వాన్ని గూర్చి వెంకట్రావుతో చర్చించారుకూడాను. వాళ్ళ అభిప్రాయాలు సరిగ్గా తన అభిప్రాయాలకు అతికినవి. ఆరోగ్యకరమైన యీ భావాలను వెంకట్రావు మెచ్చుకున్నాడుకాని, వీళ్ళు పైకిమాట్లాడేతీరులో అతనికి అనుమానం వొదల్లేదు. అందుకని తాను కనిపెట్టదలుచుకున్న నగ్నసత్యంకోసం మరింత పట్టుదలతో వున్నాడు.

నెలరోజులు తిరక్కముందే వెంకట్రావు సత్యాన్ని పరిశోధించగలిగాడు. తనతో లంచాన్ని నీచంగా చిత్రించిన పెద్ద మనుషులే లంచంపట్టటం తను కళ్ళారా చూశాడు; ఐతే, తను చూస్తున్నట్లు వాళ్ళకు తెలిసినా లెక్కచెయ్యలేదు; తానసలు అక్కడలేనట్లుగానే వాళ్ళు చేతులు తడిచేసుకున్నారు. ఏమిటీ, వీళ్ళధైర్యం! తననొక నాపకింద జమకట్టారు. వీళ్ళ నీచత్వాన్ని బహిరంగంగా ఖండించాలనిఅతను అనుకున్నాడుకాని, ధైర్యంలేక ఊరుకున్నాడు.

ఐనా వాళ్ళేలాచస్తే తనకేం! ఇప్పుడు తనేమైనా అంటే, మిగతా అందరూ ఏకమై తనను ఒంటరివాణ్ణి చేసేస్తారు,

ఆశయం సంగతి దేవుడికెరుక—ఇంతమందితో విరోధం పెట్టు కొని తను సాధించేదేమిటి? ఈనాడు తాసీ లంచగొండితనాన్ని రూపుమాపగలడా? తన తన ఆశయప్రకారం తాను కాలుజారకుండా వుండి, ఆత్మతృప్తిని పొందగలుగుతున్నంత సేపూ, ఈ మిగతా నీచులతో తనకు సంబంధం ఏమిటి? వాళ్ళు తనను లెక్కచేయనట్లే, తనూ వాళ్ళను లెక్కచేయకుండా వుంటే—కుక్కకాటుకు చెప్పుదెబ్బల్లే సరిపోతుంది.

మొదటిసారి ధైర్యంచేసి తన మొనుట లంచం పట్టిన వాళ్ళు వేసినదారి, ఇప్పుడు తెగినంత పెద్దదయింది. మిగతా వాళ్ళుకూడా యథేచ్ఛగా లంచం పట్టసాగారు. ఎవడిగోల వాడిదిగా తయారైంది. కేవలం తనొక్కడూ ఈ నీచానికి పాలుపడకుండా, తన పవిత్రతను కాపాడుకుంటూ వస్తున్నాడు. ఇది మిగతావాళ్ళకు గుర్రుగాడున్నా తన ఆశయానికి మరింత బలాన్ని చేకూర్చింది. ఇంతకు పూర్వం వాళ్ళంతా తనను అంటరానివాడుగా చూస్తుంటే ఇప్పుడుతానే వాళ్ళను అంటరానివాళ్ళుగా వుంచగలిగినందుకు తనను తాను అభినందించుకున్నాడు.

తనవ్రతం చెరిపేందుకు చాలా ప్రయత్నాలు జరిగినవి. తను చూస్తూండగా మిగతావాళ్ళు డబ్బుపుచ్చుకోవటం యీ ప్రయత్నాల్లో మొదటిది. ఇదిచూసి తనకు పెరపెరలాడుతుందని వాళ్ళ అభిప్రాయం; కాని వాళ్ళది తప్పుఅభిప్రాయమని తను రుజూచేశాడు...ఐతే అంతటితో మిగతావాళ్ళు

వెంకట్రావును వొదలలేదు. తనను లంచంగొండిని చేసేం దుకు ఎన్నో విధాలుగా తంటాలుపడ్డారు. ప్రార్థనలు దగ్గ ర్నుంచీ, బెదిరించటాలవరకూ వెళ్లారు. ఈ పద్ధతి మొదలు పెట్టిన దగ్గర్నుంచీ, వెంకట్రావు ఆశయానికి అదివరకులేని బలం, పట్టుదల అధికమైనవి.

ఏమైతేనేం—వెంకట్రావు కేవలం సామాన్యమానవుడు. మానవుడి అవసరాలు తనను వెంటాడుతూన్నంతసేపూ, జీవితం భారమవసాగాక, ఆయా సమస్యలకు లొంగకుండా వుండటమనేది తనకు సాధ్యమయ్యేదికాదనే మరో సత్యాన్ని కనిపెట్టక తప్పలేదు. నిజానికి పైకి తను మరింత పట్టుదలను సూచిస్తూ వొస్తున్నాడన్న మాటేగాని, లోలోన క్రమంగా తనకు తెలియకుండానే సడలిపోతున్నాడనేది—తను లొంగి పొయ్యేవరకూ కనిపెట్టలేక పొయ్యాడు.

భార్యకు జబ్బుచేసి, డాక్టర్ పరీక్షకు తీసుకువెళ్లాడు; డాక్టర్ క్షయచిహ్నాలు ఉన్నవని చెప్పటంతో వెంకట్రావు లోసగం మనిషి చచ్చాడు. తను ప్రాణసమానంగా చూసు కునే భార్యను మృత్యువాత పడకుండా కాపాడవలసిన తన బాధ్యత ఒకవైపు, ఏది ఏమైనా ఖరీదైన చికిత్సను ఇచ్చేం దుకు తగినంత సంపాదన లేకపోయిందే అనే బాధ మరో వైపూ అతన్ని ఒత్తిడి చేసినవి.

అదే మొదలు తన ఆశయం సడిలేందుకు; ఐతే అంత త్వరలో తాను దిగజారిపోతానని అతను ఎన్నడూ అనుకో లేదు. లంచాన్నిగూర్చి తిరిగి ఆలోచించసాగాడు.

తన భార్యను బతికించుకోవాలంటే తానిష్టపడని లంచం పట్టటం మినహాగా మరోమార్గంలేదు. తన ఆశయానికి ఇది భిన్నమే-కాని భార్యను చేజేతులా మృత్యుముఖంలోకి తోసెయ్యటం గొప్ప ఆశయమవుతుందా? ఆమెను బతికించుకోవటం తన కనీస ధర్మంకూడాను. వీటిని మించిన స్వార్థం ఉండనేవుంది—

మగవాళ్ళంతా నీతిగా బతుకుతూంటే, తానొక్కడే ఆ నీతిని అతిక్రమించటం కష్టం. కేవలం అందరూ చేసే పనే తాను కూడా చేయటంవల్ల, మిగతా ఉద్యోగుల దృష్టిలో తాను తక్కువయే అవకాశంలేదు. ఆమాటకొస్తే తనను కూడా తమతో సమానంగా చేసుకోవాలని మిగతా ఉద్యోగులు తహతహలాడుతున్నారు. ఇన్నాళ్ళూ తాను బిగదీసుకొని ఉండగలిగాడుకాని, ఇప్పుడు వాళ్ళతో కలవక తప్పేట్లుగా లేదు.

విచిత్రమేమంటే యీ ఉద్యోగులు ఇంత లంచగొండులైన సంగతి ఆఫీసర్‌కు తెలిసికూడా వూరుకోవటం. ఆఫీసర్ కూడా కాస్తో, కూస్తో నంజేవాడే కావటంవల్ల ఒకళ్ళ లంచగొండితనాన్ని విమర్శించగల తాహతు ఆయనకు లేదు. కాతునుబట్టి గుర్రం నడుస్తుందికదా! అలాంటి కాతులో లేని ఆ నియమాల్ని ఇన్నాళ్లూ తాను అనుసరించి కాలాన్నీ, ధనాన్నీకూడా వృధాచేసుకున్నాడు. ఏమైనా ఇప్పటికి మించిపోయిందిలేదు—

ఇన్ని కష్టాలూ ఒకేసారి ఎదురైతే తను మాత్రం ఏం చేయగలడు? లంచంపట్టటం పాపమే అనుకున్నా, ఆ లంచం పట్టిన ధనమంతా తనభార్య చికిత్సకోసం వినియోగించబడుతుందికనుక, ఆ పాపమంతా ఆమెదే ఐతీరాలి; తాను మాత్రం నామమాత్రంగా మధ్యవుంటాడు—అంతే!

చివరకు లంచాన్ని పట్టేందుకు నిశ్చయించుకున్నా, వెంకట్రావు ఒకపట్టాన దానికి లొంగలేదు. మరికొన్ని నియమాల్నికూడా అనుసరించేందుకు అతను నిశ్చయించుకున్నాడు. అందులో మొదటిది—భార్య ఆరోగ్యవంతురాలు కాగానే లంచంపట్టటాన్ని మానెయ్యటం...తాను ఎవర్నీ బాధించకుండా, వాళ్ళకు ఇష్టమై ఇస్తేతప్ప తీసుకోకపోవటం. ఈ రెండోపద్ధతి తన అంతరాత్మకు ఎంతో తృప్తిని ఇస్తుంది. ఎందుకంటే లంచంపట్టటం అవినీతి ఐనప్పటికి, లంచం ఇవ్వటం కూడా అవినీతి అనకతప్పదు. ఇచ్చేవాడు ఉన్నప్పుడేకదా, తీసుకునేవాడంటూ వుండటం! కనుక అవినీతిలో సగభాగమే తనకు వర్తిస్తుంది. మొదటినియమాన్ని అతను పాటించలేకపోయ్యాడు కాని, ఈ రెండో నియమాన్ని మాత్రం ఈనాటివరకూ పాటిస్తూనేవున్నాడు.

లంచం పట్టేందుకు మొదటిఅవకాశంకోసం వెంకట్రావు ఎక్కువకాలం వేచివుండనక్కర్లేకపోయింది. అంతకుపూర్వం లోటిగుమాస్తాలు తనకోసంగాను లంచంపట్టి తనకు ఇవ్వబోయినా నిరాకరించిన వెంకట్రావు, చడీచప్పుడూ లేకుండా

వొచ్చినలంచాన్ని జేబులో వేసుకోవటంతో తోటిగుమా
స్తాలు మొదట ఆశ్చర్యపడినా, వెంకట్రావు లెక్కచేయ
లేదు. అది మొదలూ వెంకట్రావు మిగతావాళ్ళతో కలిసి
పోయాడు.

సమయానికి తనకు లంచం ఆధారమైంది. వెంకట్రావు
తన నియమాన్ని దూరాన వుంచబట్టే భార్యను బతికించుకో
గలిగాడు. తమాషా ఏమంటే మొదట్లో కేవలం తన అవసరం
వరకే లంచం పట్టాలనుకొన్న వెంకట్రావు వొస్తున్నదాన్ని
వొదులుకోలేని ఆశక్తతకు గురయ్యాడు. డబ్బు కాస్త బాగా
రాసాగాక, జీవితస్థాయికూడా పెంచాడు; చూస్తూ చూస్తూ
సౌఖ్యాల్ని వొదులుకోవటం వెంకట్రావు ఆశయాల్లో ఒకటి
ఎన్నడూ కాదు!

తరువాత తరువాత—వ్రతం చెడటమనేది ఒకసారి జరి
గాక, మరెన్నిసార్లు జరిగినా ఒకటేననే అభిప్రాయంతో
వెంకట్రావు చేతిని తడిచేసుకోవటంలో వెనుకంజ వేయలేక
పోయ్యాడు. దూరం ఆలోచిస్తే తనకన్న పెద్దజీతగాళ్ళే
పొల్పడుతున్నారు; వారు దుర్మార్గంగా, ఎదుటి వ్యక్తిని కష్ట
పెట్టయినాసరే తమ అవసరాలను తీర్చుకుంటున్నారు.
వాళ్ళతో పోల్చుకుచూస్తే తను చాలా నయం—పరమ
దుర్మార్గుడికన్న, దుర్మార్గుడే నయమన్నట్లు!

—ఇంతటి పూర్వ చరిత్రవున్న వెంకట్రావు ఈనాడు
కష్టంలోపడ్డ ఈగమాదిరి ఎటూతోచక ఛస్తున్నాడు.

ఖర్చులు తగ్గించటమనేది అనుకునేటంత తేలిక కాదు. అందులోనూ ఏళ్ళతరబడి అలవాటైన జీవితంనుంచి కిందికి దిగిరావటం తన శక్తికిమించిన పని! పోతే సంపాదనను ఏదో విధంగా పెంచటంతప్ప వేరేమార్గం లేదనేది నిర్ధారణగా తేలింది.

ఐతే యీ కొత్తవాతావరణం తన పై సంపాదనకు ఏ విధంగానూ అనుకూలంగాలేదు. మిగతావాళ్ళు ఎలా బతకగలుగుతున్నారో తనకు తెలియదు; తెలుసుకోవాల్సిన అవసరంకూడాలేదు. బుద్ధిమంతులల్లే, లంచం అనేమాటనే ఎన్నడూ వినని పరమపవిత్రులల్లే కనిపిస్తారు. అన్నిటినీ మించి ఆఫీసరంటే గజగజా వొణుకుతారు. ఆఫీసరు చాలా కఠినుడనీ, ఏ మాత్రం తప్పు జరిగినా వూరుకునేవాడు కాదనీ వెంకట్రావు మొదట్లోనే గ్రహించాడు. ఆఫీసర్నిబట్టే గుమాస్తాల ప్రవర్తన వుంటుందనే సంగతి అతనికి కొత్తగాదు. తనుకూడా గుమాస్తాయే గనుక తనకూ వాళ్ళదగ్గర ఉంచుకోవాల్సిన అవసరం తప్పలేదు.

తన సమస్యను ఎవరితో చర్చించగలడు? అందులోనూ ఎవరిగోలలో వాళ్ళున్న ఆఫీసులో ఇది సాధ్యమయ్యేది కాదు. ఉద్యోగధర్మంలోనే కాస్త పైసంపాదనను చవిచూడగల అవకాశం ఉన్నప్పటికి ఆఫీసర్ అంటే భయం తనకూ ఉండబట్టి మెదలకుండా వూరుకోవాల్సివొచ్చింది.

ఇట్లా ఎన్నాళ్ళు? యీ సంసారాన్ని యీడటం రోజురోజుకూ కష్టతరమౌతోంది, తెగించి ఏమైనా చేస్తే అసలు

ఉద్యోగానికే ఎసరయేట్లయితే—గుడ్డిలోమెల్ల, పరిపూర్ణ మైన గుడ్డిగానే మారుతుందేమో?

ఆలోచించగా ఆలోచించగా వెంకట్రావు ఒక నిశ్చయానికి వొచ్చాడు. అమితజాగ్రత్తగావుండి, పట్టుబడేందుకు వీల్లేని పరిస్థితుల్లోనే కాస్త పుచ్చుకుందామని నిశ్చయించుకున్నాడు. పట్టుబడితేకదా—ప్రమాదం! అందుకని తేలిగ్గా సంపాయించటం, సులువుగా దూసుకోవటమే అతని ప్రస్తుత నిశ్చయం.

దీనికి ముందు కొంత వాతావరణాన్ని సృష్టించాలి. తోటి గుమాస్తాలవలెనే తనూ షేక్స్పియర్ మొహంవేయటం, తనపని తప్ప వేరే ఆలోచనే లేనట్లు నటించటం మొదలుపెట్టాడు. దీంతో తమవలెనే వెంకట్రావుకూడా యీ కొత్త వాతావరణానికి అలవడ్డాడని అందరూ అనుకోవాలని అతని అభిప్రాయం!

వెంకట్రావు అదృష్టంకొద్దీ ఒకనాడు ఆ అవకాశం వొచ్చే సూచనలు కనిపించినవి. బట్టలు లైసెన్స్కోసం తొందరపడే షావుకారు తారసిల్లాడు. ఆ షావుకారుతో వెంట్రావు మాటలు పెంచలేదు. 'చూస్తాను' అనిమాత్రం అన్నాడు. షావుకారు దీనంగా, త్వరగా లైసెన్స్ ఇప్పించమని కోరాడు. తనను వేధిస్తున్నట్లుగా వెంకట్రావు కసురుకున్నాడు. ఆ తరువాత, సాయింత్రం ఆరింటికి రమ్మన్నాడు.

షావుకారు వెళ్ళిన దగ్గర్నుంచీ ఆ లైసెన్స్ విషయంలోనే అతని బుర్ర తీవ్రంగా పనిచేసింది. ఆ కాగితాలన్నీ

బైటికిలాగి ఫైలుకెత్తి, మెల్లిగా ఆఫీసరుకు పంపాడు ఆఫీసర్ ఏ యూవలో ఉన్నాడో కాని, నిమిషాలమీద పనై పోయింది. ఆ కాగితాన్ని జాగ్రత్తగా డ్రాయర్‌లో పెట్టుకుని ఎప్పుడు ఆరవుతుందా అని వెంకట్రావు ఎదురు చూడ సాగాడు.

ఐదున్నరకు ఆఫీసర్ బైటకివెళ్ళాడు. మరో పదినిమి షాల్లో ఆఫీసులోని గుమాస్తాలందరూ బైటికివొచ్చేశారు. కొంపలుమునిగే పనివున్నట్లు వెంకట్రావుమాత్రం ఏదో రాసుకుంటూ, యేం జరుగుతోందో తెలుసుకునే తీరికకూడా లేనట్లు తలవొంచుకునే కూర్చున్నాడు. తనుతప్ప వేరెవ్వరూ ఆఫీసులో లేనట్లు గ్రహించగానే వెంకట్రావుకు ఎంతో రిలీఫ్ కలిగింది. అదృష్టంకొద్దీ అనుకూల వాతావరణం ఏర్పడినం దుకు సంతోషించాడు—

ఈ బట్టలషావుకారు కాస్తముందు రాకూడదూ ? ఒక వేళ ఇంకా ఆరుకాలేదని ఆ ప్రాంతాల్లో ఎక్కడైనా తారె ట్లాడుతున్నాడేమోననే అనుమానంతో వరండాలోకి ఉమ్మే సుకునేందుకు వొచ్చినట్లు వొచ్చి అంతటా కలయజూచాడు. కాని అతనికి షావుకారు ఎక్కడా కనిపించలేదు... అసలు రాడేమో ! రాకపోతే సిద్ధాన్నం నేలపాలైనట్లే !...షావు కారును మనసులో లెక్కలేనన్ని తిట్లు తిట్టుకున్నాడు.

నిమిషం ఒకయుగంగా షావుకారుకోసం వెంకట్రావు ఎదురుచూడసాగాడు... ఆరుదాటిన దగ్గర్నుంచీ వెంక

త్రావుకు ముళ్ళమీదకూర్చున్నట్లుంది. ఈ షావుకారుతనను మోసంచేశాడనే అభిప్రాయంకూడా కలిగింది.

చివరకు ఆరుంబావుకు షావుకారువొచ్చాడు. అతన్ని చూడగానే వెంకట్రావుకు ప్రాణంవొచ్చినట్లయింది. అంతకు పూర్వం అతని ముఖంలో కనిపించేవిషాదం, క్షణంలో ఆనందంగామారి, చిరునవ్వురూపాన బైటపడింది.

షావుకారు దగ్గరకు రాగానే "ఇదుగోనయ్యా లైసెన్సు ...నానాఅవస్తలూ పడి సంతకం చేయించాను" అని కాగితాన్ని అందించాడు వెంకట్రావు.

"రక్షించారు బాబూ! మీ పేరు చెప్పుకుంటూను—" అంటూ షావుకారు కాగితాన్ని అందుకున్నాడు.

ఈ పేరు చెప్పుకోవటంతోనే షావుకారు తన కృతజ్ఞతనంతటినీ వెలిబుచ్చాడేమోనని వెంకట్రావు గుండెల్లో రాయిపడింది. ఆరున్నారైనా తనమాత్రం చెయ్యి జాపదలచ లేదు.

కాని షావుకారుకు యీ తాకీకాలు తెలియనివికావనే సంగతి ఆతని జేబులోకి వెళ్ళిన చేతితోపాటు బైటికొచ్చిన వందరూపాయలనోటే చెప్పింది. వెంకట్రావు మాట్లాడకుండా ఆ నోటువైపుకు చెయ్యి జాపాడు. ఎన్నడూ ఎరగని భయం అతన్ని మలేరియారోగల్లే చేసింది. వొణుకుతూన్న చేతితోనే నోటు అందుకొని, ఆశ్చర్యంతో, ఇంత తేలిగ్గా పనైనందుకు సంతోషంతో, వెంకట్రావు అట్టే నిలబడిపొయ్యాడు.

యీ స్థితిలో షాహుకారు ఎప్పుడు వెళ్ళిపోయ్యాడో అతనికి తెలియదు. షాహుకారు స్థానాన్ని ఆఫీసర్ ఎప్పుడు ఆక్రమించుకున్నాడో అసలే తెలియదు. తన నిజస్థితిని తెలుసుకునేప్పటికి పెద్ద భూకంపంలో తాను ఇరుక్కున్నాడు!

"ఊc, ఇదన్నమాట వ్యవహారం!" అని ఆఫీసర్ ఉరిమాడు.

ఏం చెప్పేందుకూ తోచక, వెంకట్రావు చేతులు నలుపుకుంటూ వొణికిపోయ్యాడు.

"సరే... రేపు చెపుతాను నీసంగతి..." అని వందరూపాయిల నోటులాక్కొని, నెంబరూ అదీ, వేరే కాగితంమీద వేసుకొని—ఆఫీసర్ వెళ్ళిపోయాడు.

వెంకట్రావుకు యీ ఉద్యోగం పోతే ఆత్మహత్యతప్ప వేరే శరణ్యంలేదు. యీ షావుకారు తనపాలిట దేవతై వొచ్చి దయ్యమై విరమించాడు. వెధవబతుకు మీద అతనికి రోతపుట్టింది. కాని ఇలా నిరాశపడటంకన్న ఆరిపొయ్యే దీపాన్ని ఏ విధంగానన్నా వెలిగించే అవకాశం వుందేమో చూడవలసిన తన కర్తవ్యం అతనికి వెంటనే గుర్తొచ్చింది.

ఆఫీసులోనుంచి బైటపడి పార్కులో ఒక మూలజేరి చాలాదూరం ఆలోచించాడు. తను లంచం తీసుకున్న సంగతి ఆఫీసర్‌కు ఒక్కడికే తెలియటం కొంతనయం. పోనీ షాహుకారు ఇవ్వబోతూంటే తాను నిరాకరిస్తూండగానే అతను వెళ్ళిపోయాడని చెప్పుకుంటే? ఎట్లా? ఒకవేళ అలా

టిది నిజమేఐనా, మెడకాయమీాద తలకాయ అంటూ ఉన్న వాడు ఎవడు నమ్ముతాడు? ఇక యీా ఆఫీసర్ సంగతి వేరే చెప్పక్కర్లేదు—తక్షణంగాచూస్తే కళ్ళనుంచి అగ్నికణాలు పడుతవి! అందుకని అబద్ధం ఆడటంకాని, ఆఫీసర్‌కు టోపీ వేయటానికి ప్రయత్నించటంకానీ తనను మరింత అగాధం లోకి దింపుతవి. పోతే మిగిలిందల్లా కఠినుడైన ఆఫీసర్ కాళ్ళమీాదపడి తన యీా తప్పును కాపాడమని ప్రార్థించ టమే!

దీనంగా, జాలిగా, బాధగా ఆఫీసర్‌కు కష్టసుఖాలను చెప్పుకోవాల్సిన పద్ధతిని వెంకట్రావు మనసులో జాగ్రత్తగా రెహార్సల్ చేసుకున్నాడు. ఎన్నడూ వెంకట్రావు యీాస్థితిలో ఎవర్నీ అర్థించలేదు......వెధవబ్రతుకు! దీన్ని లాగాలంటే ఎన్ని వేషాలు వేయాలి!

మళ్ళీ ఎక్కువసేపు ఆలోచిస్తూ కూర్చుంటే ఆఫీసర్ నిద్రపోవచ్చు. అందుకని వెంకట్రావు వెనువెంటనే ఆఫీసర్ ఇంటికి బయలుదేరాడు. యీా పద్ధతిలో తనకు తప్పక విజయం చేకూరుతుందని వెంకట్రావు గాఢంగా నమ్మాడు. ఆఫీసర్ ఇల్లు సమీాపిస్తూండగానే వెంకట్రావు మొహంలో దీన త్వాన్ని ఘనీభవింపజేశాడు. పిల్లల్లే ఆఫీసర్ ఇంటికి వెళ్ళి, ఆయనకోసం విచారించాడు.

ఆఫీసర్, గదిలో కూర్చొని చదువు కుంటూన్నవాడల్లా బైటికి వచ్చాడు. అమాంతం వెళ్ళి కాళ్ళమీాద పడదామని

వెంకట్రావు అనుకున్నాడు కాని, అంతకన్న కాస్త తక్కువ లోనే వ్యవహారాన్ని తేల్చుకోవొచ్చేమో చూద్దామనుకొని నమస్కరించాడు.

"ఎవరూ! వెంకట్రావా?...రా...లోపలికిరా—" అని ఆహ్వానించాడు ఆఫీసర్.

తన నమస్కారం పనిచేసినందుకు వెంకట్రావు సంతోషించాడు. తన ఆశలు పెరిగే అవకాశం వుందికనుక, ఇదే ధోరణి సహాయకారిగా వుంటుందని నమ్మాడు.

గదిలోకి వెళ్ళగానే ఆఫీసర్ పడకకుర్చీలో కూలబడి వెంకట్రావుకు ఒక కుర్చీచూపాడు. కాని వెంకట్రావు ఆత్మ గౌరవాన్ని ప్రస్తుతం ప్రకటించదలుచుకో లేదుకనుకా, ఆఫీసర్ దయాధర్మాలకోసమే ఇక్కడికి పరుగెత్తుకొచ్చాడు కనుకా, చేతులుకట్టుకొని నిలబడివున్నాడు.

'ఏమిటీ?' అన్నట్లు ఆఫీసర్ వెంకట్రావువంక చూశాడు.

"తమరు రక్షించాలి. ఏదో బుద్ధి గడ్డితిన్నది. పిల్లలు గలవాణ్ని. యీ ఉద్యోగం పోయిందంటే ఆత్మహత్యే శరణ్యం......" ఇంకా ఇలాటివి లక్షమాటలు చెప్పాడు వెంకట్రావు. ఆ మాటల్లో తన కుటుంబంలోని ప్రతి వ్యక్తికీ తానే ప్రాతినిధ్యం వహించాడు.

ఆఫీసర్ అంతావిని "ఐతే ఏమంటావ్? నీ కుటుంబంలోని వ్యక్తులు ఎవరుకూడా నిన్ను లంచం పట్టమనలేదు. నేను కూడా ఇలాటివి మెచ్చుకుంటా ననుకున్నావా?—ఎవరి తప్పంటావ్?"

"తప్పు నాదే అనుకోండి......కాని పరిస్థితుల వొత్తిడి వల్ల..."

"ఏం పరిస్థితులయ్యా! ఎవరి బాధలు వాళ్ళకు ఉన్నాయ్. పేరుకు ఐదొందలు జీతం నాకు వొస్తోందన్న మాటేకాని నాకు చాలుతోందనుకున్నావా? మొన్న మూడో కాన్పుకు అమ్మాయిని పంపాను. ఆరొందలు ఖర్చయింది. మళ్ళీ సంవత్సరం తిరక్కుండానే ఆమె పురిటికి తయారవక పోదు...యీ పరిస్థితుల్లో సంసారాన్ని లాగాలనే సాకుమీద లంచం పట్టటాన్ని ప్రభుత్వం హర్షిస్తుందా? లేదా జీతం పెంచుతుందా?—"

వెంకట్రావు మాట్లాడలేదు,

"చూడు మిస్టర్ వెంకట్రావ్! నేను పట్టదలచుకుంటే వెధవ వందలు కాదు—వేలుపట్టవొచ్చు తెలుసా?" అన్నాడు ఆఫీసర్.

"ఎంత మాట! తమలాటివారు నీతికి కట్టుబడే వున్నారు ...కాని నాలాటి అల్పులు—"

"—కనుక నాదగ్గర యీ వేషాలు పనికిరావు"

"ఈ మొదటి తప్పిదాన్ని క్షమించండి" అన్నాడు వెంకట్రావు—బలవంతంగా కళ్ళలోకి నీళ్ళను తెప్పిస్తూ.

ఆఫీసర్ ఇంకా యీ వాదనను పెరగనివ్వదలచలేదు. అన్నాడు: "సరే—పో యీసారికి వొదులుతున్నాను. ఇకముందు కనక ఏమాత్రం అనుమానంతగిలినాసరే నొక్కేస్తాను—జాగర్త"

బతుకు జీవుడా అని వెంకట్రావు బైట పడ్డాడు. ఇలాటి బుద్ధితక్కువపని ఇంకెప్పుడూ చేయకూడదని నిశ్చయించుకున్నాడు.

ఏమో ఎటుపోయి ఎటొచ్చి ఆఫీసర్ తన అభిప్రాయాన్ని మార్చుకుంటాడేమోననే అనుమానంతో నాలుగైదురోజుల దాకా వెంకట్రావు మామూలు మనిషవలేదు. ఇక ఆఫీసర్ ఆవిషయాన్ని తేమ అనే నమ్మకం కలిగాక, వెంకట్రావు పునఃపరిశీలనలో పడ్డాడు.

ఈ ఆఫీసర్ తనను క్షమించాడు—నిజమేకాని తను చేసిన తప్పేమిటి? వందరూపాయిలూ తను పుచ్చుకున్నాడన్న మాటేకాని, గద్దల్లే ఆఫీసరే ఆ కాస్తా తన్నుకుపోయాడాయె! నిజానికి ఆఫీసరే నేరంచేశాడు. పైకిమాత్రం తనొక్కడే నేరస్థుడు—క్షంతవ్యుడూను!

తనను క్షమించిన ఆఫీసర్ — తన వందరూపాయిల నోటునూ ఇచ్చేస్తే ఎంత సంతోషించేవాడు! అప్పుడు నిజంగానే ఆయన తనను క్షమించినట్లయేది. ఈసంగతి ఆయనకు విశదపరిచే ధైర్యం వెంకట్రావుకు లేదు. అలా చేస్తే పోయిన వందాపోగా, తనగొయ్యి తానే తవ్వుకున్నవాడవుతాడు.

అందుకని వెంకట్రావు తెలివిగా నోరుమూసుకున్నాడు. ఒకకొత్త నిశ్చయానికికూడా వొచ్చాడు. ఎన్నిబాధలు పడ్డాసరే ఈ ఆఫీసర్ ఏనాసరే, తనైనాసరే ట్రాన్స్ఫర్ అయ్యేదాకా లంచంమాట తలపెడితేవొట్టు! అని.

# అతిథి

నేను గుంటూరులో బి. ఎ. క్లాసు చదువుతూ వున్నప్పటి సంగతి.

నేను, ఆనందమూ ఒకే గదిలో వుండే వాళ్ళం. వాడు నాకన్న ఒక క్లాసు జూనియర్ అయినా—ఇద్దరం ఒక పట్ణంలోనే, ఒక హైస్కూల్లోనే చదువుకున్నవాళ్ళ మవటం వల్ల, చదువు సంధ్యల్లో కలిసిమెలసి వుండేవాళ్ళం;

ఒకనాడు సాయంకాలం. పార్కులో భద్రం మాస్టారు కన్పించారు. మేము హైస్కూల్లో చదువుతూ వున్నప్పుడు ఆయన హిస్టరీ, జాగ్రఫీలు చెప్పేవారు: గురువర్యులు కన్పించారని చేరివాక నమస్కార బాణాన్ని ప్రయోగించాము.

"ఓహో! మాస్టారూ—క్షేమమా? ఎప్పుడు వచ్చారు? మనవాళ్ళు (అంటే, ఆ హైస్కూల్లోని ఇతర మాస్టర్లు, మేము ఎరిగిన ఇతర విద్యార్థి, విద్యార్థినులు) బాగున్నారా?" అంటూ ఆనందం ప్రశ్నించాడు.

మాస్టారు ఉబ్బి, తబ్బిబై—"ఓ! మీరా! ఆ, అందరూ క్షేమమే. మీరు ఇక్కడ చదువుతూ వున్న సంగతి తెలుసు కాని, రూము ఎక్కడో తెలిసింది కాదు. నేను నిన్నరాత్రి వచ్చాను—కలక్టరాఫీసులో పనివుండి ఇంకా రెండుమూడు రోజులు పట్టవచ్చు ఆపని. ప్రస్తుతం...హోటల్లోనే మకాం." నీళ్ళు నమిలారు.

ఇక బాగుండదని ఆనందం, "మా రూము వుండగా మీకు హోటల్ ఎందుకండీ?" అన్నాను.

చిక్కేం దే సందనుకున్న మా మాస్టారు—"దానికేం రూము ఎక్కడో తెలిసిందికాదు" అన్నారు.

"సరే వెళ్దాం పదండి"

"ఎంతదూరం?"

"అరండల్ పేట—పిచ్చికలగుంట దగ్గర."

"అబ్బ! ఇవ్వాళ నడిచి, నడిచి కాళ్ళన్నీ పట్టుకుపొయ్యా యోయ్! ఏదైనా జట్కా పిలుద్దూ."

సరే, నని జట్కా పిలిచాం. మాస్టారు కొద్దిగా స్థూల కాయులవటంవల్ల, జట్కాలోకి మెల్లిగా ఎగబ్రాకి, తమ బొందితో సగం జట్కాను ఆక్రమించారు. మిగతా సగం చోటులోనే మేముకూడా ఎక్కాము. మాస్టారు జట్కా హోటల్ మీదుగా పోనిచ్చి, తమ సామాను జట్కాలో పెట్టించి, మెల్లిగారూము జేరుకున్నాము. జట్కాదిగి మాస్టారు తీసుగా రూముదగ్గరకు వెళ్లారు. జట్కా అద్దెతో తమ కేమీ పని లేదన్నట్టు. మాకు తప్పని సరిగా, జేబులో నుంచి పావలాతీసి జట్కావాడికి ముడుపు చెల్లించవలసి వచ్చింది.

రూములో ప్రవేశించాక, మా మాస్టారు దర్జాగా క్యాంపు కాటుమీద శయనించి (క్షీరసముద్రంలో శ్రీమహావిష్ణువు శేషశాయిమీద పవళించిన, బొమ్మలో లాగు) రూము

బాగానే వున్నది; కాని, బాగా చదువు తున్నారా? అసలు మీరు యిద్దరూ ఫస్టుమార్కులతో ప్యాసయ్యే విద్యార్థులు. మీరు పొయ్యాక (అంటే చావటం కాదు!) హైస్కూల్లో, చదువులో అందె వేసిన చెయ్యే లేదోయ్!'' అంటూ మమ్మల్ని ఉబ్బవెయ్యటం మొదలుపెట్టారు. ఈ మాస్టారు బోటివాళ్ళను, అదివరకు తొంభైతొమ్మిదిమందిని చూసి వున్న—ఈ కాలేజి స్టూడెంట్సుకు, మాస్టారు మాకు గ్యాస్ కొడుతూవున్న సంగతి తెలియకుండా వుందా? అదివరకు మమ్మల్ని 'డల్ హెడ్స్' అని పిలిచే మాస్టారు, ఇవ్వాళ ''మీరే ఇంద్రులు మీరే చంద్రులు'' అన్నారంటే—ప్రత్యేకంగా ఆయన తెలివి తక్కువతనం బయిట పడటంలా? అందులోనూ ఎండమావుల్లాంటి మా చదువు మాకు తెలియదూ? ''ఆ. ఆ. బాగానే చదువుతున్నాము'' అని మాస్టారికి సమాధానం చెప్పాము.

ఏడుగంటలవగానే మాస్టారు. ''ఇవ్వాళ పొద్దున ఎప్పుడో అన్నం తిన్నాను. హోటల్ ఇక్కడకు ఎంతదూరం?'' అని సణిగారు. మాస్టారు భోజన ప్రియులని మాకు తెలుసు. అయిదుగంటలకు అయ్యర్ హోటల్లో తొక్కిన చపాతీ ఇంకా ఉదర గోళంలోనే గోలచేస్తూ వున్నా, మాస్టారికోసం మేము కూడా బయలుదేరి హోటల్‌కు వెళ్ళాం.

రెండుకప్పుల ఎక్స్ట్రా పెరుగుతో సహా మాస్టారి భోజనం పూర్తయింది. భోజన మయ్యాక మాస్టారికి ఒక కిల్లీ

యిచ్చాం. దాన్నొక బుగ్గకిందికితోసి—"ఇవ్వాళ సినిమా ఏమిటోయ్ !" అన్నారు.

"సినిమా మంచిది కాదు కానండీ, స్థానంవారి సారంగధరం వుంది—"ఆనందం అన్నాడు. మాస్టారు సంతోషపూర్వకంగా, చూసి చాలా రోజులయిందోయ్ ! అయితే వెళ్దాం పా," అంటూ, "హాలు చాలాదూరం కాబోలు, అన్నం తిని పరుగెత్తితే కడుపులో నొప్పివస్తుంది జట్కాపిలు," అన్నారు.

ఈ మాస్టార్ని అనవసరంగా అంటించుకున్నందుకు ఆనందాన్ని లోలోపల తిట్టుకున్నాను. కాని యేమీఅనేందుకు వీలు కాని Situation అవటంవల్ల గప్‌చిప్‌గా వూరుకోని, జట్కాలో పడి హాలుకు జేరుకున్నాం. మళ్ళీ జట్కాకు మా చేతిడబ్బే దర్శించుకున్నాం.

మాస్టారు టిక్కెట్లు కొంటారేమో, కొంత ఖర్చునా కలిసివస్తుందని చూసి, ఇద్దరం కొంతసేపు మాట్లాడకుండా వూరుకున్నాం. కాని మాస్టారు మొండికి వేశారు. మొండివాడు రాజుకన్న బలవంతుడు :

"ఏం ? ఇంకా బుక్కింగ్ తెరవలా !"—మాస్టారు అన్నారు.

"తెరవకేం ?" నేను చిరాకుతో అన్నాను.

ఆయన అదేమీ గమనించకుండా "అయితే టిక్కెట్లు తీసుకురాండి," అని మాస్టారు అతిధీమగా అన్నారు.

టిక్కెట్లు కొనేవాడికన్నా ఇది చెల్లుతుందో చెల్లదో అని పించింది నాకు. మాస్టారి వాలకంచూస్తే ఒత్తి ఆముదపు రాయుడిలాగ వుంది.

బాగుండదని ఆనందం. బుక్కింగు దగ్గిరకువెళ్ళి, పది నిముషాల్లో తిరిగివచ్చి, "రూపాయి బేడా టిక్కెట్లులేవు; రూపాయిపదకొండణాల టిక్కెట్లు, రెండు రూపాయిల పావ లాకు పెరిగింది." అన్నాడు.

నేను మాట్లాడక ముందే మాస్టారు. "సరే—ఏం చేస్తాం ? ఇంతదూరం వచ్చి తిరిగిపోవటం బాగుండదు సరే— కొనుక్కురా—" అన్నారు.

మాస్టారు ఈప్రియ శిష్యులమీదే తన మూడో నేత్రం తెరిచారు : సినిమాకు తీసుకువెళ్ళినా సరిపొయ్యేది. డ్రామా కు తీసుకువచ్చి, లేనిపోని కూపంలో పడ్డాము. ఇదెక్కడి బంకమన్నురా, వదిలించుకుందామన్నా వదలేటట్టు లేదని, నేను మాస్టార్ని మనస్సులో తిట్టుకున్నాను.

ఆనందం తెచ్చిన ఇంటర్ క్లాసు టిక్కెట్లతో ముగ్గురం హాల్లోకి ప్రవేశించాము. వెంటనే మాస్టారు అన్నారు—

"సిగరెట్లు లేవ్రా ?" ఒకసారి ఆనందం సిగరెట్టు కాల్చా డని క్లాసులో నానా చీవాట్లూ పెట్టిన, భద్రం మేస్టారికి యివ్వాళ సిగరెట్లు కావలసి వచ్చినందుకు, నాలో నాకే నవ్వొచ్చింది !

"ఏం సిగరెట్లు కావాలి మాస్టారు !"

"ఇక్కడ గోల్డ్ ఫ్లేకు దొరకదూ ?"

"దొరుకుతుంది"

"అయితే ఒక ప్యాకెట్టూ, ఒక అగ్గిపెట్టె. అందుకో,"
—మాస్టారు ఫర్మానా జారీచేశారు.

నాకు మాత్రం మహా చిరాకుగా వుంది, లేనిపోని తెగ నాటకం కొని తెచ్చి పెట్టుకున్నందుకు,

నాటకం ప్రారంభమయి, మూడు సీనులు అయ్యాయో లేదో—మాస్టారు సిగరెట్ పెట్టె ఖాళీ చేసేశారు.

"దాహం అవుతోందోయ్"

"సోడా తెప్పించనా సార్"

"ఎబ్బె! సోడా ఘాటుగా వుంటుంది, తాగటం కష్టం. డ్రింక్ ఏదైనా తెప్పించు."

సరేనని ఆనందం డ్రింక్ తెప్పించాడు. మాస్టారు ఒక పైనాపిల్ తాగి. "అబ్బ దాహం ఆరలేదు. ఏదీ ఇంకోటి" అన్నారు.

నాకు, ఇదంతా చూస్తే మాస్టారి వ్యవహారం ఏదో సామెత చెప్తారే—సీ...(ది) కాకపోతే గంగదాకా దేకమని. చులాగ్గా వుంది. మాస్టారు రెండు డ్రింకుస్ ఏక్‌దమ్మున పీల్చి వేశారు—కలియుగ అగస్త్యఋషిలాగు,

ఆనందం! సిగరెట్లయిపోయ్యాయి ఇంకో ప్యాకెట్టు లేదూ ?" ప్యాకెట్టు. ఆటసాంతం అయ్యేప్పటికి మాస్టారు ౩ సిగరెట్ పెట్టెలు, అరడజను డ్రింకులు చులాగ్గా వూదేశారు.

హాలులోనుంచి బయటపడ్డాక మళ్ళీ జట్కా, మాస్టారి దగ్గా జమీందార్లకన్నా వుంటుందా అని నాకు సందేహం కలిగింది. చింతమొద్దుల్లాంటి రెండు కాళ్ళు పెట్టుకొని, మాస్టారు నడవలేరూ? పోనీ జట్కాకు తనేమన్నా ఇస్తాడా? అంతా మాకే ఖర్చు! మా గతి మొగమాటానికి పోతే నానా అవస్థా అయింది.

ఇంక రూముకు వచ్చాక—"కిందపడుకోలేనోయ్ : నా చిన్నతనంలో హాకీ ఆడుతూవుంటే—ఆ కొయ్యబంతి వచ్చి నడుముకు కొట్టుకుంది : ఆ బాపతునొప్పి ఇప్పటికూడా వస్తూ వుంటుంది. ఇవ్వాళ ఆ నొప్పి కొంచెం అధికంగా వుందోయ్! — మాస్టారు సహేతుకంగా చెప్పారు. ఈ లెక్కగంతా. "మీ క్యాంపుకాటు నాకు సమర్పించి, మీరు చాపలమీద పడి దొర్లండోయ్—డింభకుల్లారా!" అని చెప్పటమాని నేతే చెప్పాలా?

మా మాస్టారి వాలకం చూస్తూవుంటే నాకు అరికాలి మంట నెత్తికెక్కింది "అంత బేవార్సుగా ఇక్కడ యేమీ లేవు తక్షణం ఇక్కడినుంచి దయచెయ్యండి." అందామన్నంత కోపం వచ్చింది. కాని, బాగుండదని పస్తాయించాల్సి వచ్చింది. మాస్టారు మాత్రం హాయిగా పాన్పుమీద పవళించారు ఆ రాత్రి.

మాస్టారు 'ఇంకా రెండుమూడురోజులపని వుంద'న్నారు. ఈ రెండు, మూడు రోజుల్లోనూ మన హాత మార్చేట్టుగా వున్నాడీయన అని నాకు భయంకూడా వేసింది.

మర్నాడు ఉదయం —

మాస్టారు అప్పటికింకా నిద్ర లేవలేదు. మేము, ఈ నక్షత్రకుడు ఒకపూట వదిలినా 'వదిలెనేనని—ఆయన్ను లేపకుండా చల్లగా కాఫీకి జారుకుంటూవున్న సమయంలో మాస్టారు తుళ్ళిపడి లేచారు. మళ్ళా మాఖర్మం కాల్చినందుకు లోలోపల భగవంతుడ్ని తిట్టుకున్నాను.

"ఎక్కడికోయ్! కాఫీకేనా?"

"అవును సార్"

"నేను కూడా వస్తా వుండండి."

మాస్టారు ఎక్కడా డి. పి. లను వృథాపోనిచ్చే రకం లాగు లేరు! వెంటనే కాలకృత్యాలన్నీ ఆపివేసి, ముఖం మాత్రం కడుక్కొని—మాస్టారు మా వెంట పడ్డారు.

మా మాస్టారి అల్పాహారం కూడా చెప్తాను! 'రాత్రి ఎక్కువ సేపు నిద్రమేలుకొని వుండటంవల్ల, వేడిచేసిందోయ్!' అంటూ ఉదయమయినా, ఒక ప్లేటు ఐస్ క్రీమ్, ఫ్రూట్ సాలడ్, రెండు ఇడ్లీ సాంబారు—అవి తిన్నాక ఇవి బాగుండలేదేయ్!' అంటూ మరో రెండు ఇడ్లీ చట్నీ, ఒక పెసరట్టు, దాంట్లో నంచుకునేందుకు ఒక ప్లేటు ఉప్మా, రెండు పూరీకూర, రెండుడ్రింకులు—'ఓవల్‌టిన్ లేకపోతే ఫ్రీమోషన్ అవదోయ్!' అంటూ ఒక కప్పు ఓవల్‌టిన్ను, ఈ అల్పాహారం చూస్తే నాకు గుండె చెరువయింది! మాస్టారు దాదాపు తులానికి బిల్లు చేశారు. ఈ అభినవగామావస్తా

మను ఏ జమీందార్లో పోషించాలిగాని, మాబోటి స్వాముల వాళ్లు పోషించలేరని వేరేచెప్పాలా ? దురద గొండాకు పసరుతో ప్రారంభమయిన దురద నన్నావదిలించుకోవచ్చు గాని—ఈమాస్టారని మాత్రం వదిలించుకునే వుపాయం నాకేమీ తట్టలేదు. నావెధవ మట్టిబుర్రను కొంచెంసేపు తిట్టుకున్నా, అప్పటి మా అవస్థ నాడు నక్షత్రక మహాశయుడితో, అడవుల్లో అవస్థపడ్డ ఆ హరిశ్చంద్రుడికి ఒక్కడికే తెలుసు ! చచ్చినట్టు బిల్లు చెల్లించిబయటపడ్డాం.

మళ్లా మధ్యాహ్నం. ఎక్స్ట్రా పెరుగులతో మాస్టారి భోజనం యధాప్రకారంగా సాగింది. మాస్టారు ఒక్క కునుకు తీసి, అంతా ముంచుకుపోతూవున్నట్టు రెండు గంటలకే లేచి, "ఈ వూళ్ళో పళ్ళేమీ దొరకవూ?" అన్నారు. గుంటూరు వంటి పట్టణంలో పళ్లు దొరుకుతయ్యా. దొరకవో మాస్టారికి తెలియదూ? అంతా మాకు అంట కట్టేందుకు—ఈ ఎత్తు.

"దొరుకుతాయి"

"అయితే—ఒంట్లో బాగుండలేదు కాని—ఒక అరడజను బత్తాలు, నాలుగు కమలాఫలాలు, అరడజను నారింజ కాయలు, ఒక పైనాపిల్ టిన్నూ తెచ్చిపెట్టు; ఇదిగో; ఈ సంచీలో వేసుకురా."

మాస్టారు కొన్ని పళ్ళపేర్లు మఱచి పోయినట్లుగా వుంది నాకు.

సంచీ అయితే చేతికి ఇచ్చారు; కాని, పర్సులో నుంచి డబ్బు బయటకు రాదే! 'డబ్బు నీదగ్గర వుందిగా' అన్నట్టుగా మాస్టారు ఒక కోరచూపు చూశారు.

అధమం పూటకొక తులమున్నా లేనిది మాస్టారి ఉదర గోళం పూరింప బడేట్టుగా నాకు తోచింది. మాస్టారి సుగ్రీవాజ్ఞ శిరసావహించి, దేవుడో అంటూ ఆ వాగన్ పళ్లూ తెచ్చి ఇచ్చాము. మాస్టారు ఫలహారానికి ఉపక్రమించారు. రెండు బత్తాయిలు తోలుతీసి, కొన్ని తొనల్ని మా ముందుకు తోస్తూ, "మంచి ఆరోగ్యమోయ్! మీరు కూడా రెండు తొనల్ని పుచ్చుకోండి" అంటూ మా ముందుకు కొన్ని తొనల్ని త్రోశారు. ఇవి కాస్తా ఇప్పుడే అయిపోతే, మళ్లో రూపాయి సరుక్కు దిగుమతికి ఆర్డర్ పడుతుందేమో నని భయంతో 'మాకు అక్కర్లేదు లెండి." అని మేము తప్పు కున్నాము. మొగమాటంమాట తలపెట్టకుండా, మాస్టారు పళ్ళల్లో కొన్ని ఆరగించి, మిగతావి స్టాక్ చేసుకున్నారు.

తిరిగి సాయంకాలం అయిదుగంటలకే మాస్టారు ఆరంభించారు! "అబ్బ! ఎన్నిపళ్ళు తిన్నా ఆకలి ఆరదోయ్! కాస్త కాఫీ పొయ్యకపోతే ఆత్మారాముడు శాంతించేటట్టు లేదు; తలకాయ నొప్పికూడా వస్తుంది"—తనకు కాఫీ ఎంత అలవాటో సూచిస్తూ, మాస్టారికి ఇప్పుడు తలకాయ నొప్పివస్తే అమృతాంజనం డబ్బాకు ఆర్డరు పడుతుందని, కాఫీకే తీసుకెళ్లాము. అదిమాత్రం తక్కువా? తిరిగి ఆరణాల బిల్లు మా

నె_త్తిన పడ్డది. మాస్టారి వ్యవహారం కొరివి పెట్టి నె_త్తిగోక్కు-న్నట్టుగా వుంది. అ_త్తవారు కొ_త్త శోభనపు పెళ్ళికొడుకును కూడా ఇట్లా మేపుతారో మేపరో నాకు అనుమానమే!

మళ్ళీ రాత్రి యథా ప్రకారంగా భోజనము, దాని తరువాత ఫలహారము, తాంబూలము సక్రమంగా నడిచాయి. మాస్టారు తిరిగి పాన్పుమీద శయనించి గుర్రుపెడుతూ సుఖ నిద్రపోయారు.

తెల్లవారీ వారకమునుపే మళ్ళీ కాఫీ, ఉప్మాలు మగ పెళ్ళివారి ఫలహారాలను విడిదికి తెప్పించినట్లు, మాస్టారు మాచేత రూముకు తెప్పించనందుకు కొంచం సంతోషమే!

కాఫీ సేవించి రూముకు రాగానే మాస్టారు,

"ఇదిగో పోస్టాఫీసు తెరిచారూ?" అని ప్రశ్నించారు. మళ్ళీ మెడకు యేదో వురి తగిలిస్తూ వున్నాడు. పుణ్యపురుషుడని నా గుండెల్లో రాయిపడ్డది.

"ఆ తెరిచే వుంటారు"

"అయితే—ఇవ్వాళ ఇంటికి వు_త్తరాలు రాయాలోయ్ నాలుగు కవర్లూ, నాలుగు కార్డులూ తెచ్చిపెడుదూ."

డబ్బుమాత్రం ఇవతలకు రాదే!

ఈ మాస్టారు ఇవ్వాళ సాయింకాలానికి తొకముసు_స్తే ఆంజనేయ స్వామివారికి అరడజను కొబ్బరికాయలు కొడతామని మనస్సులో మొక్కుకున్నాం. మాస్టార్ని, తాతము_త్తాతలతో సహా ఏకరువుపెట్టి మనస్సులో తిట్టుకున్నాం—కాని వదలడే!

కార్డూ కవర్లూ తెచ్చాక 'ఆనక రాస్తాలే' అంటూ మాస్టారు బ్యాగ్‌లో వాటిని జాగ్రత పరిచారు. తన పరస నల్ ఎక్స్‌పెండెచర్ కూడా మా చేత పెట్టిస్తున్నాడు— మేము ఏమన్నా ఇంపీరియల్ బ్యాంకులము రిజర్వుబ్యాంకులము అనుకున్నాడేమో—మహాశయుడు!

"ఆఫీసు పని వుందోయ్!"

హో బాబూ! సగం నస తగ్గుతుందని మనస్సులో సంతోషించాము. ఇంతలోకే "భోజనం చేసి వెళ్తాను" అన్నాడు, మళ్ళీ అరణాలు మాకు చేతిదే!

భోజనమయ్యాక జట్కా పిలవమన్నాడు జట్కాలో గొబ్బెమ్మలాగు కూర్చొన్నాడు. ఈ సారికన్నా మాకు జట్కా అద్దె తప్పింది లెమ్మనుకున్నాం.

"ఇదుగో! "ఆనందం! నా దగ్గర చిల్లరడబ్బులు లేవు. నీదగ్గరో పావలావుంటే ఇవ్వు." అంటూ భద్రం మాస్టారు, పావుతులం క్యాష్ మా ఆనందం దగ్గర గుంజాడు. ఇలాంటి వ్యక్తి ఇన్‌సూరెన్స్ ఏజంటుగా వుంటే ఎంత బాగుండునో అనిపించింది నాకు!

ఆ సాయంకాలం—

మాస్టారు స్థూలకాయాన్ని రూముకు జేరవేశారు. వచ్చేప్పుడు నడిచే వచ్చారు—మానవుడు! మటి మమ్మల్ని చూస్తేనేనా యీ జట్కాలు:

"ఇప్పుడు బండేమీ లేదూ?"

అమ్మయ్య! రాహువు వదిలి గ్రహణ కాలం వదిలిపోతూ వుంది బ్రతుకు జీవుడా అనుకొని— "ఇంకో ముప్పావు గం టలో ఒక బండివుంది సార్" అన్నాము.

"అయితే ఏదీ జట్కా?" గద్గయ్య స్వరంలో నన్నా క్షేమా వుందా?

మాకు కోపం ఎక్కువయింది.

ఒక జట్కావాడు మాస్టారి దిలాసాచూసి, మా రూము దగ్గరే, గుంటదగ్గిర నక్కలాగు, ఎప్పుడు పిలుస్తామోనని, సెకండ్‌హాండ్ బీడీలు కాలుస్తూ పత్తికాయల్లాంటి మిడి గుడ్లు తిప్పుకుంటూ, వేపచెట్టుకింద బిఛాణా పరిచాడు.

ఎట్లాగో మాస్టారి సామాను జట్కాలోవేసి, స్టేషన్‌కు జేరవేశాం. ఏ సెకండుక్లేసు టిక్కెట్టో మాచేత కొనిపిస్తా డేమో ననుకున్నాం; కాని తనే థర్డుక్లాసు టిక్కెట్టు కొని తెచ్చుకున్నాడు. మెల్లిగా ఆ స్థూలకాయాన్ని రైలుపెట్టి లోకి తోసి సాగనంపాము. ఇల్లాంటి అతిథుల్ని ప్రసాదించ వద్దని భగవంతుడ్ని ప్రార్థించాము.

రూముకు వచ్చి మాస్టారికింద ఖర్చయిన డబ్బంతా అంచనావేస్తే—పదిరూపాయిల పావలాకు తేలింది. కరువు కాలంలో అంతడబ్బు మాచేత ఖర్చు చేయించినందుకు— భద్రం మాస్టార్ని—ఒక పావుగంట సేపు తిట్టాం—కాని ఏం లాభం?

— జనవరి, 1941

# దంపతులు

(ప్రకాశరావు ఇంట్లో రాత్రి తొమ్మిది గంటలవేళ ప్రకాశరావూ, అతనిభార్య లీలావతీ మాట్లాడుకుంటున్నారు)

లీలా—మరి ఎట్లాగండీ?

ప్రకాశ—నన్నేం చెయ్యమంటావ్ ? మందులకూ, నూకులకూ ఖర్చుపెట్టేప్పటికే నాదుంప తెగుతోంది.

లీలా—మెళ్ళో యేమీలేకుండా బైటికివెళ్ళటమంటే—

ప్రకాశ—మరేమీ పర్వాలేదు. 'ఫలానా ఆయన భార్య' అని ఎవరన్నా అనుకున్నా, ఆచెడుపేరు నాకేకాని, నీకు కాదులే!

లీలా—పోనీ, మీరేమన్నారు? సంవత్సరం పూర్తి కాగానే గొలుసు చేయిస్తామన్నారా? సంవత్సరమూ పోయింది; మరో అర్ధ సంవత్సరంకూడా గడచిపోయింది. ఎప్పుడు అడిగినా ఇంకా ఆగమంటారు. బంగారం ఖరీదు పెరిగిందంటారు. ఈ యీడంతా పోయ్యాక గొలుసులు ఏం చేసుకోనండీ?

ప్రకాశ—అప్పుడసలు అక్కర్లేదు. ఇప్పుడుకాస్తపిక సప్తానంటే నాలుగు వందలు ఆదాచేసిన దాని వవుతావ్.

లీలా—మీరు మహా ఆదాచేస్తున్నట్టు!

ప్రకాశ—చెయ్యటంలా? బ్యాంకు ఎక్కవుంటుచూడు.

లీలా—అన్నట్టు, జ్ఞాపకం వచ్చింది...పోనీ, బ్యాంకులో డబ్బు తియ్యరాదటండీ ?

ప్రకాశ—ఎంత తేలిగ్గా చెప్పావ్ ! ఆడవాళ్ళ సలహాలు యీ దేశంలో అతిచౌకగా దొరుకుతయ్ ; అందులోనూ గృహిణుల సలహాలు—

లీలా—మరి ఎట్లాగండీ ? అనుభవించేందుకు కాకపోతే, యీ డబ్బు ఏం చేసుకుంటామండీ ?

ప్రకాశ—అబ్బో డబ్బు ఏంచేసుకోవాలో తెలియకనే నేను బాధపడుతున్నా ననుకున్నావా ? లేక ఖర్చుపెట్టుకోవటం తెలియక, నీసహాయాన్ని కోరుతున్నా ననుకున్నావా ? కష్టపడి, చెమటోడ్చి సంపాయించే డబ్బువిలువ—ఇంట్లో కూర్చొని, భోంచేసి, తగినంత విశ్రాంతి తీసుకునే నీకెలా అర్థమవుతుంది ?

లీలా—అదికాదండీ ; నాకుమాత్రం ఎందుకు తెలియదూ ? ఈ సంపాదన మీ కుటుంబం కోసమేగా ? అందుకు ఖర్చు పెట్టటం తప్ప యేమిటి ? మీరు వాగ్దానం చేసిందేగా ?

ప్రకాశ—ఊరుకో...గొడవ !

లీలా—మన సౌఖ్యం నాకు అక్కర్లేదన్నమాట ?

ప్రకాశ—(కోపంతో) ఆ జ్ఞానంవుంటే ఎప్పుడో బాగుపడేవాళ్ళం.

లీలా—పోనీ చెప్పండి...

ప్రకాశ—ఇదివరకు లక్షసార్లు చెప్పాను.

లీలా—సాధించక, ఇంకోసారి చెప్పరాదూ ?

ప్రకాశ—చెప్పుకోవాల్సిందే—(కాస్త ఆగి) ఏం—మీ వాళ్ళను అడగరాదూ ?

లీలా—(మౌనం)

ప్రకాశ—ఆ మాట ఎత్తేప్పటికి మూగనోము పడుతుంది !

లీలా—(మెల్లగా) ఎలా అడగమంటారూ ? వాళ్ళు మాత్రం పోగు పోసుకు కూర్చున్నారా ?

ప్రకాశ—ఊహుఁ. మరి నేనే ఇక్కడ పోగుపోసుకుంది !

లీలా—అని అన్నానటండీ ?

ప్రకాశ—అనటం ఒకసారీ ఖర్చు పెట్టించటం ఒకసారీనా ?

లీలా—పోనీ, మీరు ఆలోచించండి...మావాళ్ళ సంసారమంతా చితికి పోయింది కదా, ఈ స్థితిలో వాళ్ళను అడిగేందుకు నోరు రావద్దండీ ?

ప్రకాశ—ఎవరి కష్టాలు వాళ్ళకుంటయ్. మనకష్టాల్ని ఎవరితో చెప్పుకుంటాం ?

లీలా—ఇదేమంత పెద్దకష్టమండీ ?

ప్రకాశ—నీకంటికి ఇదో గొప్ప విషయమా ? మీవాళ్ళ ఇంటిదైతే గోరంతలు కొండంతలుగా కనిపిస్తయ్ కాని—

లీలా—(పౌరుషంగా) మాట్లాడితే మావాళ్ళ మీదికి వస్తారుకదా—

ప్రకాశ—అబ్బో ? కోపంకూడా వచ్చింది కాబోలు! ఏం, మీవాళ్లు చేసినవన్నీ బాగున్నయ్యేం—నేను అంటేనే తప్పొచ్చిందన్నమాట !

లీలా—వాళ్లేం చేశారండీ ?

ప్రకాశ—ఏం చేశారా ? కట్నంసొమ్ము ఇంతవరకూ ఇవ్వరేం ? ఎప్పుడు అడిగినా ఇదిగో అదుగో అని గడుపు తారుకదా—ఏం అసలు ఇవ్వలేనివాళ్ళు మాటివ్వటం దేనికి ? నాలుగేళ్ళయినా అతీగతీ లేకపోతే—!

లీలా—రోజులు కలిసివస్తే ఇవ్వరటండీ !

ప్రకాశ—'ఇప్పించనటండీ' అనలా—ఇంకా నయం! నువ్వుఅడగరాదూ ? నాతో పోట్లాడేందుకు ఉండే నోరు—అడిగేందుకు ఉంటేగా ? పుట్టిల్లంటే మహా భయపడి చస్తున్నట్టు నటన ! మళ్ళీ నమర్థనకూడాను ! నీ మూలానే అసలు యీ వ్యవహారం తెలకుండావుంది. మాట్లాడితే మీవాళ్ళను నెనకేసుకువస్తావ్. ఏదో చదువుకున్నదానివని సహించి ఊరుకుంటున్నా కాని...

లీలా—ఏమిటండీ యీధోరణి ?

ప్రకాశ—ఇలాగే నన్ను రెచ్చగొడితే దేహశుద్ధి...

లీలా—(రోషంతో) ఏమిటీ - కొడతారా ?

ప్రకాశ—(రెచ్చి) ఏం కొట్టక ? అసలు ఆపని ఇదివరకే జరిగివున్నట్టయితే బాగుండేది ; లొంగి ఉండేదానివి.

లీలా—(దుఃఖం క్రమంగా ఆవరిస్తూన్న కంఠంతో) ఇప్పుడు ఎవరు తిరుగుతున్నారటండీ?

ప్రకాశ—కాక ఇదేమిటీ?

లీలా—నా ఖర్మ! (ఏడుస్తోంది)

ప్రకాశ—ఏడుస్తావ్...ఏం రోగం?

లీల—(ఏడుస్తూ) ఏ రోగమూ లేకపోబట్టే—

ప్రకా—దొంగవెధవ్వలు నాకు తెలుసు. కట్టిపెట్టు...నీకే చెప్పేది...ఈవీధివాళ్లు రాత్రి మృదువైనకంఠంనుంచి వచ్చే ఏడుపులకు ఇంకా అలవాటవలేదు. పసిపిల్లలుంటే భయపడతారుకూడాను...మానవే!

లీలా—నన్ను ఏడవనీయండి—(ఏడుస్తోంది)

ప్రకాశ—చావనీయొద్దూ?

లీలా—(గొంతు ఎక్కించి) చంపండి...చంపండి... (ఇంకా పెద్దగా ఏడుస్తోంది)

[వీధి తలుపు కొట్టిన చప్పుడు]

ప్రకాశ—ఒసేయ్...ఉండవే!...ఎవరో వచ్చినట్టున్నారు

[మళ్ళీ తలుపుకొట్టిన శబ్దం]

ప్రకాశ—నీకే చెప్పేది. ఏతేలుకుట్టిందోనని వీధివాళ్ళందరూ వచ్చారో ఏమో? కాస్త ఆపవే...తలుపు తీస్తున్నాను (బతిమాలుతూన్నట్టు) ఇదిగో—ఆపవే?

లీలా—ఆపక ఏం చేస్తున్నానేమిటి? (బలవంతంగాఏడ్పు ఆపిందికాని సన్నగా ఎక్కిళ్ళతో దుంఖం వస్తూనేవుంది,)

ప్రకాశ—(తలుపు తెరిచి) ఎవరూ?

శాస్త్రి—నేనండీ—శాస్త్రిని.

ప్రకాశ—దయచెయ్యండి.

శాస్త్రి—ఇదుగో, వస్తున్నా; చుట్ట అవతల పారేసి.

ప్రకాశ—(చప్పున ఇంట్లోకివచ్చి) లీలా! మన ఇంటి యజమాని శాస్త్రిగారు వస్తున్నారు; ఆయనచూస్తే బాగుండదు...ఏడుపు ఆపవే?

లీలా—(ఆపలేక సన్నగా మూలుగుతూ) నాకు చాతకావటం లేదండీ.

ప్రకాశ—రండి...కుర్చీమీదకు దయచెయ్యండి.

శాస్త్రి—(కూర్చుని, లేచి) ఇల్లు బాగుందాండి?

ప్రకాశ—ఓ! బాగుంది...ఎల్లాగైనా అద్దెలకోసమని ప్రత్యేకంగా వ్యాపారదృష్టితో కట్టిన ఇళ్ళకూ, మనమే ఉండేందుకని కట్టుకున్న ఇళ్ళకూ బోలెడంత భేదం వుంటుందండీ!

శాస్త్రి—ఏబ్బే! ఆమాట మీరంటే ముఖస్తుతిగా తీసుకోవాల్సి వుంటుంది. ఇంటి లోటుపాట్లన్నీ ఆడవాళ్ళకే తెలియాలి సుమండీ!...నువ్వు చెప్పమ్మా?

లీలా—(లేచి వెళ్ళబోతూన్నదల్లా కూర్చొని, ఆపుకున్న కంఠంలోంచి ఇంకా బైటపడేందుకు ప్రయత్నించే దుఃఖంతో) వారు చెప్పింది—నిజమే—బాబుగారూ!

శాస్త్రి—ఏమమ్మా అట్లా ఉన్నావ్?

లీలా—(బాధ దాచుకుంటూ) ఎట్లా ఉన్నానండీ?

శాస్త్రి—ఏమో?...ఉత్సాహంగా లేవు. కళ్ళు ఏదో బాధను సూచిస్తున్నయ్. అదిగో చెక్కిళ్ళమీద తడి ఆరని కన్నీరు...

లీలా—(గొంతు సరిచేసుకొని) ఎబ్బే! ఏం లేదు బాబు గారూ!

ప్రకాశ—ఏం లేదు లెండి (తడబడుతున్నాడు)

శాస్త్రి—అలాగంటే కాదుసుమండీ! నేనొక మాట చెప్పదలిచాను: ఇరుగు—పొరుగు అంటే చిన్ననాటినుంచీ వస్తూన్న స్నేహితులకన్నా రక్తస్పర్శవున్న బంధువులకన్నా అధికమైనఅనురాగంతో ఉండాలనినాఅభిప్రాయం. ఒకరిసహాయాన్ని ఇంకొరు కోరకపోయినా, కనీసం ఒకరి కష్టాలకు ఒకరు సానుభూతి చూపటం ధర్మం...మీరేమంటారు?

ప్రకాశ—నిజమేనండీ..

శాస్త్రి—మరి నాదగ్గర దాచట మెందుకూ? చూడండి: మీరు వచ్చిన వేళావిశేషం ఏమిటో కాని, నాకు మహదానందంగా వుంది. నాహృదయాన్ని దాచకుండా చెప్పాలంటే—లీలమ్మ నా కన్నకుమార్తెకన్న ఎక్కువనిపిస్తుంది.

లీలా—మీరు చాలా దయగలవారు. (నవ్వేందుకు ప్రయత్నించింది)

శాస్త్రి—దయేమిటమ్మా? మీదంపతుల్ని చూస్తూంటే మీలాటివాళ్లు ప్రపంచంలో ఉండి, మాలాటి ముసలివాళ్ళకు

శాంతి ఇస్తున్నా రేమో ననిపిస్తుంది. మీదాంపత్యం చూస్తే, నాకు గతించిన జీవితమంతా జ్ఞాపకం వస్తుంది...

ఇంతకూ, చెప్పమ్మా! మీ ఇద్దరి మనసుల్లోనూ ఏదో కలకలం బయలుదేరిన మాటనిజం. అది మీ ఇద్దర్నీ బాధిస్తోందనేందుకు మీముఖాలే సాక్ష్యం ఇస్తున్నయ్... చెప్పరు కదూ?

(ఎవరూ మాట్లాడలేదు)

శాస్త్రి—నన్నింకా అనుమానిస్తున్నారు కదూ? (క్షణం ఆగి) పోనీ, నేను మాత్రం మిమ్మల్ని శ్రమ పెట్టటం దేనికీ? నిజం చెప్పాలంటే—నాకు జరిగిందంతా తెలుసు; నేనంతా వింటూనే వున్నాను.

(దంపతులు ఒకరి మొహాన్ని ఒకరు చూసుకున్నారు.)

శాస్త్రి—కాని, మీ ఇద్దరికన్నా—ఈడులోనూ, అనుభవంలోనూ పెద్దవాణ్ని. పెద్దవాడనే గౌరవమన్నా మీరు నాకు ఇవ్వకపోరు...ఒక్కసంగతి: నాజీవితం మీకేమీ తెలియదు కదూ? నాకు బంధువులంటే మనచుట్టూ రోజూ తిరిగేవాళ్ళే సుమండీ! అసలుసంగతి ఇలాంటి సంఘటనలే నన్ను జీవితంలో అణగతొక్కినయ్... చెప్పనా?

ప్రకాశ—(నీరసంగా) ఊఁ

శాస్త్రి—(బాధగా నిట్టూర్చి) అది ఇరవై సంవత్సరాల నాటిమాటమ్మా—

లీలా—ఊఁ.

శాస్త్రి—నాకూడా భార్య ఉండేది. మొదట్లో మా దాంపత్యజీవితం చాలా సౌఖ్యంగా సాగింది. కాని రాను రాను మా ఇద్దర్లోనూ అనేక భేదాభిప్రాయాలు కలిగినయ్. ఒక విషయమని చెప్పేందుకు వీల్లేదు; భోజనపదార్థాలదగ్గ ర్నుంచీ నగలదాకా—ప్రతీదీ చర్చనీయాంశమే! 'గంటకొక సారైనా ఏదో తగూ మామధ్య జరుగుతూనే వుండేది. పురుషుణ్ని, సంపాదనాపరుణ్ని—నామీదనే ఆమె జీవితమంతా ఆధారపడివుందనే అహంతో ఎలాగైనా ఆమె పంతాలు నెగ్గనీకుండా చూసి, అధికారాన్ని చలాయించాలని నేను ప్రయత్నించేవాణ్ని...పాపం. ఆమెకూడా పెద్దింటి ఆడబడు చేనామె!ఎంతకాలమనినాఅధికారాలకూ, దుర్వినియోగంచే సేభర్తృత్వానికీ లొంగిపడి వుండగలదు? ఇంతగా అలవాటైపో యిన ఆ కీచులాటలు మానుకోవటంకూడా నాకు పెద్దసమస్య అయిపోయింది. ఏదోవిధంగా ఆమెను బాధిస్తేనేకాని నాకు తృప్తివుండేదికాదు. ఇప్పుడు తలుచుకుంటే మానవరూపాన శత్రువునైనా అలా బాధించగలిగిఉండేవాణ్నా అనిపిస్తూం టుంది. కాలంతోపాటే, వయస్సుతోపాటే—పెరగాల్సిన అనురాగానికి మారుగా—మా మధ్య పెరుగుతూవచ్చిన అర్థం చేసుకోలేని వ్యక్తిత్వం—మాలో కనపడని అగ్నిని క్రమంగా రగుల్కొల్పింది. కుటుంబపైరంకన్న ఘోరమైనబాధ యీ లోకంలో ఇంకోటిలేదు... 'వడ్లగింజలో బియ్యపుగింజ' తగూలను ఆమెభరించలేకపోయింది. సామాన్యస్త్రీ చూప

లేని ఎంత సహనాన్ని చూపినా ప్రయోజనం లేకపోవటం వల్ల...ఆమె చివరకు విసిగి, ఏం చేసిందనుకున్నారు?

ప్రకాశ—(ఆత్రుతతో) ఏంచేసింది ?

శాస్త్రి—(శబ్దమయ్యేట్టు నిట్టూర్చి నన్ను శిక్షించింది. ఇంకేవిధంగా శిక్షించినా నేను భరించగలిగి ఉండేవాణ్ని. కాని ఆ శిక్ష—(ఆగాడు)

లీలా—ఎలా శిక్షించింది బాబుగారూ ?

శాస్త్రి—ఎలాగేమిటి తల్లీ ? మళ్ళీ యీ జన్మానికి మా మధ్య ఏ విధమైన పోట్లాటలూ, మాట్లాటలూ లేకుండా చేసిందమ్మా !

ప్రకాశ—అంటే ?

శాస్త్రి—మీకింకా తెలియలేదా ? నన్ను యీ లోకానకి ఒంటరివాణ్నిగా అప్పగించింది...ఈ బాధలతో తనకిక పని లేదన్నట్టు—ఆత్మ—హత్య...

ప్రకాశ, లీలా—(ఆశ్చర్యంతో) ఆఁ!

శాస్త్రి—ఏం చెప్పుకోను ? (విచారంగా) తరువాత ఏమనుకొని ఏం ప్రయోజనం ? ఆమె శవానికి ఎన్ని క్షమార్పణల్ని చెప్పుకున్నాను ; ఎంత దీనంగా గొంతెత్తి ఏడ్చాను !

ప్రకాశ—తరువాత ?

శాస్త్రి—మీరు ఊహించుకోండి. ఆ స్త్రీకివున్న పట్టుదల—ఇంత పౌరుషంగా, మూతిమీదిమీసంతో ఇన్నాళ్ళ బతుకును చూచిన నాకు ఎన్నడూ కలగలేదు ! తరువాత

తలుచుకుంటే—నా అంత దుర్మార్గుడూ, నీచుడూ, పాపీ, హంతకుడూ లోకంలో ఉంటాడా అనిపించింది... శాస్త్రి తప్పును యీ విజ్ఞానంతో గంపంతగా విమర్శించుకొని, ఆ బాధపడలేక, తిరగబడ్డ అభిమానాన్ని ఒక్కమార్గానే చూపుకోగలిగిన...ఆమె...వ్వ్

ప్రకాశ—అంతా మీ తప్పు కాదనుకుంటాను.

శాస్త్రి—ఆమాట నేను ఎన్నడూ—కనీసం—అనుకోలేక పోయ్యాను. దంపతుల్లో ఎవరి తప్పయినా ఉండనివ్వండి-ఎవరికివారు తమంతట తామే సర్దుకుపోవటాన్ని నేర్చుకోకపోతే ఆకాపరం నరకసమానమేనండీ! నిజంగా, ఆమెదే తప్పయినా నేను మూర్ఖుణ్ని కాకపోతే సర్దుకోకూడదా? వెధవ 'అహం' నన్ను రేపి యీస్థితికి లాగింది. మీరు నమ్ముతారో లేదో కాని నావల్ల మావంశానికిచుట్టుకున్న యీకళంకం, ఒకవిధంగా నేనే ఆమెహత్యకు కారణమని నన్ను బాధించే యీ కల్మషాత్మ-నాకు జీవితంలో దేనిమీదా ఇష్టంలేకుండా చేసింది. ఈఅంధకారి జీవితంలో నే ఎలాబతకగలుతున్నానో నాకే ఆశ్చర్యంగా వుంటుంది...వెధవ చిన్న చిన్న పోట్లాటలు— ప్రణయకోపమని భ్రమపడేవి- ప్రళయకోపమై, జీవితాల్నే పాడుచేస్తాంటే.....ప్రకాశరావ్ గారూ! మీకా కింకా స్త్రీ అభిమానం తెలియలేదు. స్త్రీ సాహసిస్తే...?

ప్రకాశ—నాకు బాగా అర్థమైంది!

శాస్త్రి—లీలమ్మతల్లి! దాంపత్యం సర్దుకుపోయ్యేందుకు వీల్లేనిదైతే, చూశావా—నాగతి ఏమైందో?

లీలా—నిజమే బాబుగారూ!...(పశ్చాత్తాపంగా) అసలు నిజం చెప్పాల్సివస్తే ఇవ్వాళ మా పోట్లాటకు - నేనే వారిని రెచ్చగొట్టానండీ—

ప్రకాశ— కాదు శాస్త్రిగారూ! అనవసరంగా నేనే ఆమెను బాధించాను—

శాస్త్రి—అంతే! అలా అనుకుంటేపోయె. (కాస్తఆగి) అబ్బ! పది ఐనట్టుంది. చాలా శ్రమపెట్టాను. మరి సెలవా? (వెళ్ళిపోయ్యాడు)

ప్రకాశ—పాపం! జీవితంలో చాలా పెద్దదెబ్బ తిన్నాడు.

లీలా—ఎంత బాధ పడుతున్నాడో—పాపం!

ప్రకాశ—కాని, లీలా! నన్ను క్షమించు. నా తప్పు తెలిసింది.

లీలా—ఛీ! ఊరుకోండి. నేనే మిమ్మల్ని బాధపెట్టాను.

ప్రకాశ—పోనీ. ఇవాళ్టినుంచీ ఇద్దరమూ భేదాభిప్రాయాలకు గురికాకుండా వుంటే?

లీలా—నేను కాదన్నానటండీ? మీమాట వినేందుకు ఎప్పుడూ సిద్ధమే.

ప్రకాశ—నేనూను...లీలా! నువ్వసలు దేవతవు. నిన్ను అర్థంచేసుకోలేక...

లీలా—అలా అనకండి నేనే మిమ్మల్ని అర్థంచేసుకోలేక...

ప్రకాశ—పోనీలే...ఇద్దరికీ ఇప్పటికన్నా జ్ఞానోదయ మైంది. సరే లైటు తగ్గించు పడుకుందాం.

## 2

[ రెండు నెలలు గడిచాక — ప్రకాశరావు యింట్లో
రాత్రి ఎనిమిది గంటలవేళ ]

లీలా—(నవ్వుతోంది)

ప్రకాశ—ఏమిటే? ఇంటికి రాగానే నన్నుచూసి నవ్వుతున్నావ్? ... ఏం? నీకు నవ్వుతెప్పించే పను లేమన్నా చేశానా?... (బతిమాలుతూన్నట్లు) చెప్పవ్ ? ... లీలా! చెప్పవూ?...బతిమాలాలా?

లీలా—(కష్టంతో నవ్వు ఆపుకుంటూ) ఉండండి... చెప్తాను అలాకూర్చోండి...శాస్త్రిగారు మనను మోసం చేశారు—

ప్రకాశ—ఛా! ఆయన మనను కన్నబిడ్డలకన్న ఎక్కువ ప్రేమతో చూస్తాడు.

లీలా—పోనీ, ఆయన అబద్ధమాడాడు. తెలుసా?

ప్రకాశ—లీలా! అలాంటినిందలు ఆయనమీాద మోపటం—

లీలా—నిజమండీ! నేను రుజూచేస్తే—?

ప్రకాశ—చెయ్;

లీలా—రెండునెల్లకింద ఆత్మహత్య చేసుకున్న ఆయన భార్య మళ్ళీ బతికివచ్చింది.

ప్రకాశ—నాకు కథలు చెప్తున్నావా? కలలుకంటు న్నావా?

లీలా—కలేమిటండీ? నేను ఆమెను చూశాను. సాయిం త్రం ఆమెతో మాట్లాడాను.

ప్రకాశ—(నవ్వి) నేను నమ్మను.

లీలా—నిజమండీ. ఆమె ఇవ్వాళే పుట్టింటినుంచి వచ్చింది:

ప్రకాశ—(అనుమానిస్తూ) మరి శాస్త్రిగారు అలా చెప్తారా?

లీలా—చెప్పారు. ఏం చెప్తే? కాని ఆయన భార్య కూడా చాలా మంచిదండీ. అన్నపూర్ణమ్మగారు నన్ను ఎంత ఆదరించిందనీ—?

ప్రకాశ—నిజమేనా?

లీలా—నిజం...నిజం. (నవ్వుతోంది)

(తలుపుకొట్టిన శబ్దం)

ప్రకాశ—కాస్తనవ్వావు. ఎవరోతలుపుకొడుతున్నారు ...తీస్తాను.

(తలుపు తెరిచాడు; శాస్త్రి, ఆయన భార్య అన్నపూర్ణ ప్రవేశించారు.)

శాస్త్రి—భోజనాల పిలుపుకు...ఎందుకమ్మా నవ్వు తున్నావ్?

లీలా—(నవ్వుతోంది)

అన్న—ఎందుకమ్మా ఆనవ్వు!

ప్రకాశ—ఏం లేదులెండి.

శాస్త్రి—రేపు మీదంపతులు మా ఇంటికి భోజనానికి—

లీలా—నవ్వాపి) ఏమిటండీ విశేషం ?

శాస్త్రి—ఏముందమ్మా, మీ పిన్ని మళ్ళీ బతికివచ్చింది ...(నవ్వుతున్నాడు; ప్రకాశరావూ, లీలావతీకూడా కలిశారు)

అన్న—ఏమిటండీ ఇలా నవ్వుతున్నారు ? నేను బతికి రావట మేమిటీ ?

లీలా—(నవ్వాపి) చెప్తానుండండి పిన్నిగారూ! ... ఐతే బాబుగారూ ! పోయినవాళ్ళు మళ్ళీ బతికివస్తారుటండీ ?

శాస్త్రి—అయ్యో పిచ్చితల్లీ ! ఎందుకు బతకరమ్మా ? ఈ నరసిన తలవెంట్రుకలు ఎన్నో చావు బతుకుల్ని చూసినయ్. సావిత్రిపాతివ్రత్యంతో సత్యవంతుడు బతక లేద టమ్మా ? మరి భర్త ఏకపత్నీత్వంతో భార్య ఎందుకు బతక కూడదమ్మా ?

ప్రకాశ—ఈ కథ బాగుండండీ !

శాస్త్రి—కథలు రాసే ఓపికేది నాయనా ? పోనీ, నేను యీ కథను ఎక్కడన్నా రాసివుంటే—అది మీ ఇద్దరూ చదవటం తటస్థించినా లాభం లేకపొయ్యేది. కాని మీరు విన్నాక—

లీలా—నిజమేనండీ బాబుగారూ ! ఇన్నాళ్లూ నన్ను విసిరికొట్టేవారు కాని మీకథ విన్నాక, నన్ను గౌరవిస్తున్నారు.

ప్రకాశ—అది కాదంటోయ్! ఇన్నాళ్లూ మీఅమ్మాయి నన్ను అనవసరంగా బాధపెట్టేది; మీ కథతో దాని గయ్యాళితనం పోయిందండీ!

శాస్త్రి—అదే నాయనా! కావాల్సింద అంతే! ముసలి వాళ్ళం. పడుచువాళ్ళకు ఇంతకన్న బోధించే దేముంటుంది?

అన్న—ఇంతకూ నాకేమీ బోధపడటంలేదు—ఎందుకు శీలమ్మా! నవ్వుతావ్?

శాస్త్రి—నువ్వు మళ్ళీ బలికావని.

అన్న—అదే... నేను బతకటమేమిటండీ?

శాస్త్రి—నా కథలో, పోయ్యావ్ లేవే!

అన్న—ఏమిటమ్మా?

లీలా—పోనీండి పిన్నిగారూ!

అన్న—నాకు చెప్పవ్? మీ బాబాయ్‌గారు ఇలాటి అఘాయిత్యాలు చేస్తూంటారు.

లీలా—బాబుగారే చెప్తారు... కథలు బాగా చెప్పే విద్య ఆయనదగ్గరే వుంది.

అన్న—చెప్పండి.

శాస్త్రి—ఏముందీ? ఈ దంపతులు రోజూ పోట్లాడు కుంటూండేవాళ్ళు. ఒకనాడు వీరికి నేనోకథ చెప్పాను. ఆ కథలో రోజూ మనం పోట్లాడుకునే వాళ్ళం. నువ్వది భరించలేక, అచ్చంగా ఆడదాని అభిమానంతో, నామీద కసితీర్చుకునేందుకు ఆత్మహత్య చేసుకున్నావ్.

అన్న—మామీద కసికోసమా? నే నా పని ఎప్పుడూ చెయ్యను.

శాస్త్రి—చేశావో లేదో వాళ్ళను అడుగు. ఐనా నీ ఇష్టమేమిటీ? నిన్ను చంపనూ గలిగాను; బతికించనూ గలిగాను.

అన్న—మంచిపని చేశారు...... లీలమ్మా! ఆయన మాటలు నమ్మకు.

శాస్త్రి—అలా అనవోక రేపటి విందు ఆహ్వానాన్ని కూడా ఇప్పుడు నమ్మరు.

అన్న— ఊఁ. పోనీండి. అసలు సంగతే మరచి పొయ్యాను... రేపు మా ఇంట విందమ్మా! తప్పకుండా రావాలి.

లీలా—విశేష మేమిటండీ?

అన్న— మా అబ్బాయి ఎం. ఏ. ప్యాసై రేపు వస్తున్నాడు.

లీలా—(నవ్వుతూ) బాబుగారికి కథలో కొడుకులు లేరే?

శాస్త్రి—కథకుడు కొడుకుల్ని ఎంతలో కనలేడమ్మా? ఎంతలోకి ఎం. ఏ. ప్యాసు చేయించలేడు! ఎంతమందినైనా సరే...

అన్న—అబ్బ, ఊరుకోండి!

శాస్త్రి—నాకొక్క కోర్కెవుంది లీలమ్మా!

లీలా—ఏమిటండీ?

శాస్త్రి— మీరు కీచులాడుకోవటం ఆ తమాషాను పిన్నికికూడా ఒక్కసారి చూపుతే.

అన్న—చాల్లెండి. ఏమన్నా అనుకుంటారనన్నాఉండాలి.

శాస్త్రి—ఏమమ్మా—ఏమన్నా అనుకుంటున్నావా?

లీలా—అనుకోము కాని...

శాస్త్రి—కాని?

లీలా—మీకోర్కె నెరవేరదండీ బాబుగారూ!

శాస్త్రి—మీ పిన్నికోసమమ్మా... ఒక్క సారే నమ్మా!

లీలా—నాకు చాతకాదండీ. ఓపిక ఏమన్నావుంటే ఆయనే...!

ప్రకాశ—మంచిదానివే! నాకసలు ఆ అలవాటే పోయింది శాస్త్రిగారూ! మళ్ళీ కాస్త గయ్యాళితనం మీ అమ్మాయి చూపుతేనే కాని...

లీలా—ఊఁ. మీలో మళ్ళీ కాస్త 'అధికారం' తలెత్తుతేనేకాని...

శాస్త్రి—ఊఁ. కానీండి, రంగం తయారౌతోంది. విని చాలా రోజులైంది.. చెవులు తుప్పు పట్టినట్టున్నయ్.

లీలా—కాదుగాని బాబుగారూ; మీకు కోపం రాకుండా వుంటే, నాదో కోర్కె వుంది.

శాస్త్రి—నాకేం కోపమమ్మా? చెప్పు.

లీలా—మా పోట్లాట మీరు విన్నారుకాని, మీది—(నవ్వుతోంది)

శాస్త్రి—అమ్మో! అమ్మాయ్ ఏమో అనుకున్నాను. పూర్ణా! ఇక ఇక్కడ వుంటే లాభం లేదు. పా—త్వరగా. (భార్యను లాక్కుపోతూ) రేపు భోజనాలమాట మరవకండి. (వెళ్ళారు)

ప్రకాశ—ముసలివాడు అఖండుడు!

లీలా—అనుభవం ఎక్కడికి పోతుంది?

ప్రకాశ—మన కాపరాన్ని బాగుచేశాడు.

లీలా—మన దాంపత్యాన్ని స్వర్గసమానం చేశాడు!... సరే భోజనానికి లేవండి. (నవ్వుతోంది)

ప్రకాశ—పా... రేపు వంటపని లేదనా నవ్వు? (నవ్వాడు)

—జనవరి, 1942

# ఫిరదౌసి

[తూసు గ్రామంలోని ఫిరదౌసి కవి జీర్ణగృహము. దీర్ఘ వ్యాధిగ్రస్తుడైన కవి వార్ధక్యంలోని బాధను అనుభవిస్తూ మంచంమీద పడున్నాడు. పదహారు సంవత్సరాల కుమార్తె మోతియా - కింద చింకిచాప మీద కూర్చుని విచార వదనంతో తండ్రికి సపర్యచేస్తోంది. ఆ పగలు గతించేందుకు మరొక గంట ఆలస్యం వుంది.]

ఫిర——మోతియా!

మోతి——బాబా!

ఫిర——నేనింక బతకను తల్లీ.

మోతి——(దుఃఖిస్తూ) మీరల్లా అధైర్య పడకండి...

ఫిర——ఏడవకు...మోతియా! ఏడవకు...నీకు నేను ఏముద్దు తీర్చలేక పోయ్యాను. నాజీవితంతో పాటే నీది కూడా నలిగి...వాడి పోయింది...

మోతి——కొంతసేపు శాంతంగా పడుకోండి బాబా?

ఫిర——(వికటంగానవ్వి) శాంతి!...మోతియా! ఆమాట విని పదమూడేళ్ళయింది. ఒకప్పుడు ప్రశాంత జీవితంకోసమే భ్రమించి-చివరకు ఆశను నిరాశగా చేసుకొన్నాను. కాని నన్ను చూచి విధి ఎప్పుడూ నవ్వలేదు తల్లీ! ఎన్ని కమ్మని కలల్నికన్నా ననుకొన్నావు? ముందేమో స్వర్గసౌఖ్యముం

పని లేనిబలంతో చేతిని జాపాను; కాని అభాగ్యుణ్ణి — సా కది లభించనే లేదు...(నిట్టూర్చాడు)

మోతి—బాబా! నిరాశపడి మీ ఆరోగ్యాన్ని చెడ గొట్టుకుంటున్నారు.

పిర—అంతకన్న నాజీవితానికి మిగిలిందేముందేదమ్మా? ఆశ పెట్టుకొనీ బాధపడ్డాను...నిరాశతోనూ బాధపడుతు న్నాను.........ఒకనాడు పిరదౌసి కవి గజనీ పట్టణవీధుల్లో నడుస్తూంటే-ప్రజలు వంగి వంగి సలాములు చేసేవారు. అతని కవిత్వానికి అప్పుడెంత విలువ ఉండే దనుకొన్నావు?

మోతి—ఇప్పటికూడా ప్రజలు 'పారశీక కవుల్లో పిరదౌసి అంతటివాడు ఇదివరకు పుట్టలేదు; ఇకముందుపుట్ట బోడు' అని అంటూంటారు బాబా! పిరదౌసి కవికీర్తి దిక్కుల పిక్కటిల్లు తోంది!

పిర—(నవ్వి) వెర్రితల్లి! కాని, కీర్తివాయు భక్షణతో పిరదౌసి కవి పొట్ట ఎన్నడూ నిండలేదు. అతను సాహిత్యా నికి తీరని కళంకాన్ని చేకూర్చిన పాపి...!

మోతి—అదేమిటి బాబా?

పిర—(నిట్టూర్చి) అతను ముప్పది సంవత్సరాలు తన రక్తాన్ని సిరాగా ఉపయోగించి ఒక గ్రంథాన్ని రాశాడు. తల్లీ! ఒక్కటే గ్రంథమమ్మా! అది అరవై వేల పద్యర త్నాల్తో నింపబడ్డది! కాని దానిని ఒక నీచుడి పాదాలకు సమర్పించి పిరదౌసి 'సాహిత్యద్రోహి' అయ్యాడు తల్లీ...!

మోతి—బాబా! వింతగా మాట్లాడుతున్నారు!

పిర—నీకు తెలియదమ్మా! అప్పటికి నీకు మూడు సంవత్సరాల వయస్సే! (ఉద్రేకంతో) పిరదౌసి 'షానామా' గ్రంథాన్ని ఒక్కనాడు కాదు...ఒక్కఏడు కాదు...ముప్పది సంవత్సరాలు రాశాడు...పారశీకచక్రవర్తుల చరిత్రను లోక చరిత్రకు కలిపాడు. ఆ కవితాసుధతో కటిక చీకటిలో భూగర్భంలో దాగివున్నవారి అస్థిపంజరాలకు దేహాన్ని ఇచ్చి, ప్రాణాన్నిపోసి సకలాభరణ భూషణాలతో అలంకరించివారిపైన పండు వెన్నెలను ప్రసరింపజేశాడు. కాలచక్రాన్నిపట్టి బలవంతాన కొన్ని శతాబ్దాలు వెనక్కు తిప్పి పారశీక ఏలికల కీర్తి ఆచంద్రతారార్కము విలసిల్లేట్టు—సువర్ణాక్షరాల్తో 'షానామా'లో లిఖించినాడు కాని ఇదంతా ఎందుకు చేశాడో తెలుసా? తన కవితా ప్రతిభను వెలగట్టి నడిబజారులో తెగనమ్ముకొనేందుకు ప్రయత్నించాడు. కాని వాడే మోసం చేశాడు... ఆ మోసాన్నే ఇన్నాళ్ళుగా ఇన్నేళ్ళుగా నా హృదయంలో క్షణక్షణాభివృద్ధయి మిన్నుముట్టేట్టు జ్వాలల్ని కక్కుతోంది ఎంత కన్నీరు కార్చినా ఆ అగ్ని చల్లారదు మోతియా...

మోతి—బాబా! నాకు అర్థమవటంలేదు.

పిర—ఎలా అర్థమాతుంది? లోకానికి మాత్రం ఎలా తెలుస్తుంది? వినండి—(ఉన్మత్తునివలె) పిరదౌసి కవి ఏళ్ళ పర్యంతమూ సరస్వతీదేవిని ఆరాధించాడు. ఆమె అతనికి

ఎప్పుడూ ప్రసన్నవదనగానే వుంది! కాని లక్ష్మీ ప్రసన్నతను అతను చవి చూచి ఎరుగడు. నాల్గువందల మంది ఆస్థాన కవులకు లేని గౌరవం గజనీ మహమ్మదు ఆస్థానంలో ఫిరదౌసికి ఒక్కడికే ఉండేది. ఈ ప్రజలంతా గజనీ మహమ్మదువంటి సారస్వత పోషకుడు పారశీక భూమిని జన్మించ లేదనే నమ్మారు కదూ? అది భ్రమ! వినండి—'షానామా' గ్రంథ రచనలో—ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్క దీనారాన్ని ఇస్తానని సుల్తాను ఫిరదౌసి కవికి ఖురాను సాక్షిగా వాగ్దానం చేశాడు. ఆ మూర్ఖుడు దాన్ని నమ్మి రాత్రనక, పగలనక—నిద్రాహారాలు మాని, ఏకపుత్ర శోకంలో కుములుతూ కూడా ముప్ఫై సంవత్సరాల కృషితో ఒక్క షానామా గ్రంథాన్ని సృష్టించ గలిగాడు. ఆ ఉద్గ్రంథాన్ని కరకుతురక పాదాలకడ బలిఇచ్చాడు అందుకు ఫిరదౌసి కవిపొందిన శిక్ష మీకు తెలుసా? సుల్తాను నుంచి బంగారు నాణాలకు బదులు, వెండి నాణాల్ని పొందేందుకు మాత్రమే అర్హుడయ్యాడు!...ఆపద్యాలకు అదిచాలదా అని అడుగుతున్నారా? కొన్ని కోట్ల మానవులకు చేతకాని రచనావిధానంతో—అతనొక్కడే మృత చక్రవర్తులకు ప్రాణంపొయ్య గలిగాడు. కవిత్వపు విలువను లోకంలో ఎవరు చెప్ప గలరు?...మీరు ఫిరదౌసికిఇస్తూన్న గౌరవంలో ఏభాగాన్ని చక్రవర్తి చూపించలేదు! ఇప్పుడు చెప్పండి—సుల్తాను గారి సాహిత్య సేవను గూర్చి—!

మోతి—(కన్నీళ్ళతో) బాబా! బాబా! అంత ఉద్రేకంగా మాట్లాడకండి.

పిర—(కాస్త ఆగి) నీకు ఎల్లా తెలుస్తుంది నా బాధ? ఆ శూన్యాకాశంలో ఎన్ని సౌఖ్యసౌధాల్ని నిర్మించుకొన్నాను మోతియా? కాని నా జీవిత భానుడు ఏనాడో అస్తమించాడు తల్లీ! దీపాన్ని చూసి భ్రమించిన తిమిరాన్నయ్యాను. పిరదాసి కవి ఒక్క బాధకే నోచుకున్నాడు; కాని లోకం అతని కవితా ప్రతిభను అనుభవించేందుకు నోచుకుంది.

మోతి—పోనీండి బాబా! ఐపోయినదాన్ని గూర్చి విచారిస్తూ, ఆ తుచ్ఛధనంకోసం బాధపడకండి—

పిర—నాకు ఏ విచారమూ లేదు- మోతియా! కాని నా ప్రాణప్రదమైన కవిత్వ కన్యను చరపట్టి ఆ తుచ్ఛుడికి, నీచుడికి అర్పించి, నా జీవితాన్నే నాశనం చేసుకున్నాను. చూడు మోతియా! ఈ శిథిలకుడ్యాల్లాగే నా శరీరం కూడా నశించేందుకు సిద్ధమైంది. నువ్వు లోకానికి చెప్పమ్మా—పిరదాసి కవి కూటికిమాడి చచ్చిపోయ్యాడని! అతనికీర్తి అతని చెవులకు ఆనందాన్నిచ్చినా, అతని పొట్టలోని ఏ భాగాన్నీ తృప్తిపరచ లేదని—

మోతి—బాబా! మీరు పడుకోండి; జబ్బు ఎక్కువౌతుంది—

పిర—ఇంకా నామీద ఆశ దేనికి తల్లి? ఈ దౌర్భాగ్య మహాకవి కుమార్తెవైనందుకేగా—యీ బీదరిక శృంఖలాల శిక్ష?

మోతి—(కవి రొమ్ముమీద తలపెట్టి వెక్కి వెక్కి ఏడుస్తూ) బాబా!...బాబా!

పిర—ఏడవకు మోతియా!...ఏడవకు! నీకున్న చివరి వ్యక్తికూడా యీ లోకాన్ని విడిచి వెళ్ళిపోతున్నాడనా ఏడుస్తున్నావు? ఇంకెన్నాళ్ళు బలవంతాన బతికి యీ బాధల్ని అనుభవించను తల్లీ?

(పెద్ద దగ్గు తెరవచ్చింది; కవి సొమ్మసిల్లాడు)

మోతి—బాబా! ఈ నీళ్ళు తాగండి (మంచినీళ్ళు అందిచ్చింది.)

పిర—(క్షీణస్వరంతో) ఒద్దు... నాజీవితమంతా నాకు తోడు నీడై నిలిచిన...నీకు నేను కృతజ్ఞుణ్ణి...(కళ్ళు మూసుకున్నాడు.)

(వీధి తలుపు తట్టిన చప్పుడు)

మోతి—ఎవరూ?

('తలుపు తెరవండి' అనే కేక. మోతియా తలుపు తెరిచింది. ఎదురుగా రాజభటులు.)

మోతి—ఎవరు మీరు?

రాజభ—రాజభటుణ్ణి.

మోతి—అంటే?

రాజభ—సుల్తాను గజనీ మహమ్మదు గారి...

మోతి—(భయంతో ఒణుకుతూ) మీరా? మీరా? యమదూతలు! ఎందుకొచ్చారు? బాబా ఇదివింటే ప్రాణాలు

విడుస్తాడు. ఒద్దు మీ పాదాలు పట్టుకుంటాను.— వెళ్ళిపోండి— కావాలంటే నన్ను తీసుకుపోండి...బాబాను యేమీ అన వద్దు...(కన్నీరు పెట్టింది.)

రాజభ—ఎందుకమ్మా అల్లా భయపడి కంటనీరు పెడ తావు ?—పిరదౌసి కవి సార్వభౌముడికి బంగారు నాణాల్ని తెచ్చాము—

మోతి—(పట్టలేని ఆనందంతో) నాణాలా? బంగారమా? వెండా ?

రాజభ—వెండికాదు. తల్లీ అరవై వేల బంగారు నాణాలు ?

మోతి—(దుఃఖంలో నవ్వుతూ) ఏవీ అవన్నీ ?

రాజభ—అవిగో బజార్లో ఒంటెలమీద—!

మోతి—(సంతోషంతో ఎగురుతూ) సుల్తాను పంపారా? (పెద్దగా) బాబా ! బాబా ! నిరాశపడొద్దు ! నీకృషి వృథాపో లేదు బాబా ! పిరదౌసి కవి ప్రతిభను లోకం యీ నాటి కైనా తెలుసుకోగలిగింది !

(కవి మంచం దగ్గరకు పరుగెత్తి) బాబా !

(సమాధానం లేదు)

మోతి— బంగారు నాణాలు బాబా ! అరవై వేలు నీకోసం—

(కవి కదలలేదు; మెదలలేదు)

మోతి—(కవి శీతల శరీరాన్ని తాకుతూ) పలుకు బాబా! ఒక్కసారి మాట్లాడు బాబా ! ఎంత శుభవార్త తెచ్చాను. చనిపొయ్యావా బాబా ? నన్ను చూడవా. నాకింక యీ లోకంలో ఎవరున్నారు బాబా ! బాబా! (భోరున ఏడుస్తోంది.)

రాజభ—అమ్మా! నాణాలు ఎక్కడ దింపము ?

మోతి—(వికటంగా) నాణాలా ? ఎవరికీ ? ఎందుకూ ? పిరదౌసి కవి చనిపోయినాడు. అతని అమూల్యరచనకు యీ మూల్యాన్ని ఎలా అందిస్తారు ?

రాజభ—అమ్మా! పొయ్యారా ? చాలావిచారకరమైన వార్త! పోనీ వారి వారసులు- యీనాణాల్ని మీరు తీసుకోండి.

మోతి—(పెద్దగా నవ్వి) నేనా ! నేనా ! నాకొద్దు- పిర దౌసి కవి జీవితాన్ని అధఃపాతాళానికి తొక్కిన ధనమిది ! అతని జీవితాన్ని కడగండ్ల పాలు చేసిన నాణాలివి ! అతని ప్రాణాన్ని బలిగొన్న బంగారమిది ! అతని సాహిత్య సేవకు పెట్టని ఆనకట్టయిన సువర్ణమిది !— ఈ నీచధనాన్నా నేను తీసుకోవటం ? బాబా ఆత్మకు శాంతి వుండదు. బాబా భరించలేనంత దయను చూపిన మీ సుల్తాను గారినే యీ సువర్ణంతో మరొక మేడకట్టించు కోమనండి— కాలయము లారా ! పొండి...పొండి...

(శబ్దమయ్యేట్టు తలుపు వేసింది)

(బాబా మంచం దగ్గరకు పరుగెత్తి) ఆ ధనాన్ని నేను తీసుకుంటా ననుకున్నావా బాబా!... నీ ఆత్మశాంతికోసం దాన్ని ముట్టలేను! (మోకరిల్లింది) పిరదౌసి కవి చనిపోయినాడు! పారశీక దేశపు ఏకైక వీరుడు మరణించినాడు! ప్రకృతిశక్తులారా ఘోషించండి—పిరదౌసి కవి సార్వభౌముడు గతించినాడు! ప్రకృతి మాతా! నువ్వైనా నాతో శృతి కలుపు తల్లీ!

(సూర్యుడు పూర్తిగా అస్తమించినాడు. దూరాన నక్క వికారంగా అరిచింది. తీతువ పిట్ట కూసింది. పెనుగాలి శబ్దం చేస్తూ వీచింది)

—ఫిబ్రవరి, 1941

# పీడోక్కలు

[కైకారణ్యము. ఆరాత్రి గడుస్తూన్న తుదియామమది. కథ జరుగుతూన్నకొద్దీ తూరుపు తెలతెలవారుతూ ఉంటుంది. గౌతముడు రథంలో దీర్ఘాలోచనలో ఉన్నాడు; చెన్నుడు విషాద వదనంతో రథం నడుపుతున్నాడు.]

గౌతము:—(పెద్దగా) చెన్నా! రథం ఆపు.

[రథం ఆగిన శబ్దం. గుర్రాలమెడలోని మువ్వలచప్పుడు]

గౌత—చెన్నా! ఎంతదూరమొచ్చామయ్యా!

చెన్నుడు—దాదాపు పదిక్రోసులు వచ్చాం స్వామి!

గౌత—ఈ అటవీ భాగాలే నాకు మనశ్శాంతి...గమ్య స్థానాన్ని జేరాం కదూ!

చెన్నుడు—స్వా—మీ ?

(ఒక్క క్షణం నిశ్శబ్దం)

గౌత—ఇంక నేను నడవగలను చెన్నా!

చెన్న—స్వామీ! ఇంక ఇదేనా మీ నిశ్చయం?

గౌత—విచారం దేనికి చెన్నా?

చెన్న—ప్ర—భూ!

గౌత—(వికటంగా నవ్వి) ప్ర—భూ!—చెన్నా! మాంస పులకు మతులులేవు కాబోలు: చూడు. నాది నీలాటి మానవజన్మ కాదా? నీలాటి రక్తమాంసాలతో నిండినది కాదా—నా యీ తోలుతిత్తి? కాని, నువ్వు సారథివీ—

నేను ప్రభువునా? చెన్నా! ఏమిటి నాలోని ఆధిక్యత? ఎన్నాళ్ళీ భేదం? నన్ను ప్రభువుగా ఎందుకయ్యా—సంబో ధిస్తావు? ఇంక పిలు: ఓ సామాన్య మానవుడా!' అని—

చెన్న—ప్రభూ! ... ప్రభూ! మీరు ఆత్మగౌరవాన్ని కూడా లెక్క చెయ్యటంలేదు...

గౌత—ఇంతమందికి లేని గౌరవాత్మ నా కెక్కడిది? చెన్నా లోకమంతా ఏకమై తారుమారుచేసి. వివిధ వ్యక్తు లకు వివిధ బిరుదాల్ని, వివిధ స్థానాల్ని ఇస్తోందికదూ? ఒద్దు చెన్నా—నాకొద్దీ ప్రభుత్వం! నేను నువ్వుచెప్పే ప్రభువును కానేకాను. మీరు నన్ను ప్రభువుగా పరిగణిస్తున్నా నా అంతరాత్మలో ఎవరో గట్టిగా చెప్తున్నారు— నేనొక సామాన్య మానవుణ్ణే నని (వికటంగా) ప్ర...భూ!...ఇంక ఆమాట ఉచ్చరించి నన్ను బాధించవొద్దు—చెన్నా?

చెన్న—స్వామీ! ఇంత వైరాగ్యమా? ఒక సామాన్య మానవ హృదయం భరించి సహించలేని యీ ఆత్మపరీక్ష మీ కెందుకు? ఇప్పటికైనా మించిపోయింది లేదు-రండి- తిరిగి కపిలవస్తు వెళ్ళిపోదాం, ఇదే మీపాదాల్ని తాకి చెప్తు న్నాను. మీ వియోగాన్ని భరించలేని అనేక ప్రాణులు మీ కొరకు బాధపడతయ్...

గౌత—తిరిగి వచ్చేవాణ్ని ఇంతదూర మెందుకు వస్తాను చెన్నా?

చెన్న—మీరు ఆలోచించండి: తండ్రిగారు ముసలివారై నారు ఇంక రాజ్యాన్ని పాలించే నాథుడేడి? దేశం అరాజక మౌతుంది. ఎంతటి పుణ్యాత్ములకు లభిస్తుం దీరాజరికం...?

గౌత—(అర్థగోక్తిలో—వికటంగా) రా—జరికం! చెన్నా! ఒకనాడు నేనూ నీలాగే భ్రమించాను. ఈనాడు తెలుస్తూం ది—రాజరికానికున్న విలువ! ఎందు కీరాజరికం? నాకు చాలదా—ఈ విశాల విశ్వంలోని చేరెడంత మేర? ఇంత చిన్న మానవుడి కెందుకయ్యా—ఆ అఖండ సామ్రాజ్యం? నేను రాజుగా ఉన్నంత కాలమూ—నాకు లోకాలు చాలు త వా?...చెన్నా! నేనుండ లేనా బంధికానాలో—ఆనీతు లకూ, నియమాలకూ బద్ధుణ్ణయి, రాజరిక శృంఖలాలతో బంధింపబడి, ఆరాణివాసపు ఖైదులో నా జీవిత కుసుమాన్ని వాడిపోనివ్వలేను. రాజంటే—ప్రజాపాలకుడు కాదు: ప్రజా సేవకుడు! నేను సేవించలేని అసమర్థుణ్ని. నాకే కాదు—నా ఆగర్భశత్రువుకైనా ఒద్దీ 'సేవ'! నన్ను అన్వేషించనీ— విముక్తిమార్గాన్ని, బొందిలో ప్రాణ మున్నంత కాలమూ అదేగా జీవితం! ఆ అంతులేని అనుభవంలో నాకు మొగం. మొత్తిపోయింది. ఇంతకన్న అధికమైందీ, శాశ్వతమైందీ వేరొకటి ఉండితీరాలి—

చెన్న—స్వామీ! అది భ్రమ—

గౌత—భ్రమ! ఇది భ్రమ కాదా? జీవిత గాఢాంధకా రంలో దూరాన మిణుకు మిణుకుమనే ఆ దివ్యజ్యోతి నాపుకు

నన్ను పోనీ; భ్రమే ఐతే ఆజ్యోతికి తిమిరంలాగు ఆహుతైపోయి బుగ్గవనీ, ఏదైనా—దిగి చూడందే లోతు తెలీదుగా చెన్నా! నాలో ఏదో దివ్యవాణి ఘోషిస్తోంది; నా అన్వేషణ వృథాకాదని ఆ 'ఆశ' 'నిరాశ' ఐనానాడే ఆత్మతృప్తితో కపిలవస్తుకు తిరిగివస్తాను.

చెన్ను—ప్రభూ! అన్వేషణకు ఇప్పుడే ఏమంత తొందర వచ్చింది? ఇంత చిరుప్రాయంలోనే దేనికి మీకీ వైరాగ్యం? మా చిన్న ప్రభువునుకూడా వదలి వెళ్తారా?

గౌత—ఏమొచ్చిందా? చెన్నా—ఈ లోకభారానికి సంఘనియమాలకూ నా అల్పప్రాణం ఆవటిల్లుతోంది! దేవతల తృప్తిపేరిట బలికాబడే నోరులేని జంతువుల అరపులను ఇంక వినలేను. బాధపడే జీవుల్ని చూడలేను. కంటూన్నదీ వింటూన్నదీ ఒక్క 'బాధ' గానే ఉంది. నాకు - నేను బాధను అనుభవించినవాణ్ని కాకపోవటమే నాలోని పెద్ద లోపం కాబోలు! అంతేకాదు—చెన్నా! ఈ పాపభూయిష్ట ప్రపంచరాక్షసి కోరల నడుమ నా జీవితాన్ని నాశనం చేసుకోలేను; ఇంతకన్నా శాంతిలోకాలు జేరేందుకు ప్రయత్నించాలి— దానికి తొందర కాదా మరి?

చెన్ను—చిన్ననాటినుంచీ నేను మిమ్మల్ని పెంచాను ప్రభూ! ఈ చేతుల్లో ఎత్తుకుతిప్పాను; మీ సేవలోనే నాకు అర్థంకాని ఆనందం గోచరించేది. ఇన్నాళ్ళుగా మీప్రాణితో నాప్రాణిని ఏకం చేసుకొన్నాను. బిడ్డలులేని నేను—మిమ్మే

బిడ్డగా, దైవంగా, గురువుగా. ప్రభువుగా చూచుకొన్నాను. మీమాటను మనసారా పాలించాను—యజమాని ఆజ్ఞగా కాదు; దైవాజ్ఞగా!—ఈనాడు ఏతుచ్ఛసేవకుడూ ఒప్పని ఈ సారథ్యాన్ని-తమనోటివెంట మాటవచ్చినదే తడవుగా—సుగ్రీవాజ్ఞలాగు శిరసావహించాను. నామాట వినండి—ప్రభూ! తిరిగి వెళ్ళిపోదాం—ఎందుకీ అడియాస?

గౌత—చెన్నా? నిన్ను కాదన్నానా? కాని, నారాకకు ఇది సమయంకాదు.

చెన్న—నీచ సేవకుడిమాట అటుంచండి తల్లిలేనిలోటు కన్పించకుండా అల్లారుముద్దుగా పెంచి పెద్దనుచేసిన—తండ్రిని వీడిపోతారా? మీకు అంతులేని ఆనందాన్ని చేకూర్చి జీవిత మాధుర్యాన్ని చవిజూపిన యువరాణిగార్ని వదిలి వెళ్తారా? ఇంకా లోకజ్ఞానం సరిగా తెలీని చిరుకుమాణ్నికూడా లెక్కచెయ్యరా? ఊహించండి ఎన్నికళ్ళు తమ రాకకోసం ఎదురుతెన్నులు చూస్తూంటాయో! మీ వియోగానికి ఎన్ని హృదయాలు విలపించి, పరితాపానికి ఆహుతవుతయ్యో...

గౌత—(భగ్న స్వరంతో) చెన్నా నన్ను మోసగించాలని వ్యర్థ ప్రయత్నం చెయ్యకు-ఇంకెన్నాళ్లా పాడు జీవితం? (కొంచెం ఆగి) ఔను చెన్నా! ద్రోహమే చేశాను. నా జన్మకు కారణమైన నాన్నగారికీ, నాజీవితపథానికి తోడునీడై వర్తించిన భార్యకూ, నారక్తస్పర్శ ఉన్న ముద్దుల పట్టికీ కూడా తీరని అన్యాయం చేశాను. వారితో చెప్పేందు

కూడా నాకు నోరాడ లేదు-చెన్నా! ఈలోకాన్ని కష్టాల్ని కూడా మరిచి అమాయకంగా గాఢనిద్రలో ఉన్న దారాపుత్రులకు నేరంలేని శిక్ష విధించాను. ఇన్నాళ్ళుగా, ఇన్నేళ్ళుగా ఎరిగిన పెరిగిన వాతావరణాన్ని వీడి వెళ్ళేందుకు నాకూ కష్టంగానే ఉంది చెన్నా! ఏమైనా దృఢనిశ్చయంతో బయలుదేరాను. నన్ను మళ్ళించేందుకు ఎందుకయ్యా నీ ప్రయత్నం.

చెన్న—స్వామీ-హృదయం లేదా మీకు?

గౌత—లేదా?......ఉంది చెన్నా! అది ఇంతకోమలమవటంవల్లనే దానికాబుద్ధి. నాసానుభూతంతా యీనాడు ఈ రూపంలో నన్ను తరిమేస్తోంది, హృదయ దౌర్బల్యంవల్లనే ఇన్నాళ్ళూ దేన్నీ సాధించలేక—ఈ కృత్రిమ వాతావరణానికి దాసానుదాసున్నాయి, నన్ను నేనే గుర్తించుకోలేని కామాంధకారంలో జీవయాత్ర చేశాను...ఏమైనా, నాకోసం విచారించటం అజ్ఞానమూ, అకారణమూను! ఒక్కప్రాణి తక్కువైనంతమాత్రాన రాజ్యమే కొల్లపోతుందా? ఎందుక్కీ తెగని బంధనాలు? నాకు ఎవ్వరూ లేరు చెన్నా! ఉన్నా—నా జీవితమార్గంలో కలిసిన తోడి ప్రయాణీకులు. వారిదారి వారిది...నన్నుమాత్రం యీ నూతనమార్గాన పోనీండి. నా గతికి మీరెవ్వరూ బాధ్యులుకారుగా!

చెన్న—పోనీండి—ప్రభూ! అక్కడే ఈ అన్వేషణను చేయరాదా?

శాంత—(నవ్వి) అక్కడా? ఆ సంకెళ్ళతో—ఆబంది ఖానాలోనా? ఇక్కడ—ఈ ప్రశాంతారణ్యాల్లో, పక్షుల కిలకిలారావాలమధ్య, సెలయేళ్ళ అవ్యక్తమధుర శబ్దాలనడుమ ప్రకృతిదేవి నన్ను పెంచుకోనీ! మూఢనమ్మకాల నడుమనలిగి పోతూన్న నా సోదర మానవుల్ని కూర్చి—సకల సౌఖ్యాల్నీ అనుభవిస్తూ అక్కడ నేను ఆలోచించగలనా? ఒక్క స్వార్థాన్నే గురిగా పెట్టుకు కూర్చుంటే సత్యాన్వేషణలోని ఛాయనైనా నేను చూడలేను! మానవుడు, తోటి మానవుణ్ణే ప్రేమించలేక ఈర్ష్యతో మగ్గిపోతూన్న దౌర్భాగ్య జీవితం! ఆ పాడు లోకమా—నా నివాసభూమి? (పెద్దగా వికటంగా నవ్వు)

చెన్ను—ఇది మనపాలిట కాళరాత్రి!

శాంత—ఔను. కాళరాత్రే! చెన్నా! ఆ గుడ్డిదీపపు వెలుగున దారా పుత్రుల్ని చూశాను! కుర్రాడు నిద్రలో నవ్వాడు; నాకు కాళ్ళాడలేదు చెన్నా! గుండె నేను లెక్క పెట్టలేనంత వడిగా కొట్టుకుంది—అక్కడినుంచి తప్పుకొని తండ్రిగార్ని చూశాను; కొడుకుచేసే ద్రోహాన్ని కూడా గమ నించకుండా గాఢనిద్రలో ఉన్నారాయన. దూరంనుంచే నమస్కరించాను. కళ్ళనీళ్ళు తిరగినయ్—తుదిసారి నా ఆత్మ బంధువుల్ని చూశాను—ఊపిరికూడా పీల్చానో లేదో తెలీదు. అంతా మరిచిపోదామని కళ్ళు గట్టిగా మూసు కున్నాను. నాలో ఏదో నూతనశక్తి ప్రవేశించి నన్ను బైటికి తరిమేసింది...నా జీవితంలో నూతన శకానికి 'నాంది'

అయిన రాత్రి—కాళరాత్రే చెన్నా! ఎరలు లేని స్థలంలో చేపకున్న రక్షణను నాకు ఇచ్చిన రాత్రికదూ ఇది?— ఇంక వెళ్ళనా చెన్నా?

చెన్న—(అశ్రుతతో) ప్రభూ! రథం నడుపుతూ మానంలోనే బాధపడ్డాను. నా ఇలవేల్పు నన్ను వీడి వెళ్ళ టాన్ని చిత్రించుకొన్నాను. నరక బాధను అనుభవించాను. ఇది అసంభవ మనుకొన్నాను. ఎంతచేసినా నాకు తృప్తిలేక పోయింది; ఇప్పుడు ప్రత్యక్షాన చూడవలసివచ్చిందా— యీ దృశ్యాన్ని? వినవలసి వచ్చింది—భాషలోని కఠిన పదజాలాన్ని! హృదయం చీకుకుపొయ్యే యీ శిక్ష నా మీాదెందుకు ప్రభూ! ఏస్వామి ఈచేతులపైన తన బాల్యా న్ని గడిపాడో—ఆస్వామికి వీడ్కోలివ్వవలసిన రోజొకటి ముందుందని నేను కలలోకూడా ఊహించలేదు. (గట్టిగా ఊపిరివిల్చి) ప్రభూ! పీతాంబరాల్ని ధరించే మీా కోమల శరీరానికా యీ కాషాయి వస్త్రాలు? హంసతూలికా తల్పాలమీాద హాయిగా పవ్వళించే మీారా—కాలితో తొక్కి— మలినం చేసిన మట్టిలో — కటిక నేలన పడుకోవటం? ఎంతెంత వారికి ఎంతెంత దుర్దశ! ఇది మీారు చేతులారా తెచ్చిపెట్టుకుంటున్నారు. ప్రభూ! ఇక్కడ—ఈ కారడవిలో మిమ్మెవరు చూస్తారుస్వామీా?

గౌత—తెలీదా చెన్నా—దిక్కులేనివారికి దైవమే దిక్కని?

చెన్న—(నిట్టూర్చి) పోనీండి—మిమ్మువిడిచి నేనుండ లేను నన్నుకూడా మీతో తీసుకుపొండి......

గౌత—నువ్వా? చెన్నా! నువ్వొద్దు...ఎవ్వరూ వొద్దు —నేను ఏకాకిగా తిరగాలి—నువ్వు తిరిగిపో చెన్నా!

చెన్న—ఏముఖం పెట్టుకొని నేను కపిలవస్తుకు తిరిగి వెళ్ళను ప్రభూ? 'నాముద్దుల కొడుకేడీ!'' అన్న చక్రవర్తికి ఏం సమాధానం చెప్పను? 'నాభర్త ఏరీ?'అన్న యజమాను రాలికి ఏం జవాబివ్వను? 'చెన్నా! నాన్న ఎక్కడికి వెళ్ళరూ?'' అని వచ్చీరాని మాటల్తో అడిగిన కుర్రవానికి ఏం చెప్పుకోను? నాది-పాపం ప్రభూ! నన్ను చిన్ననాటినుంచీ కడుపులో పెట్టుకు కాపాడిన యజమాని వంశానికే ఘోరాన్యాయన్ని చేశాను. ఎవరి ఉప్పు తిని ఈ శరీరం పెరిగిందో వారికే ద్రోహం చేశాను—నాకు ఏ శిక్షా చాలదు...నాకు నేనై మీతో పాటు ప్రవాసాన్ని అనుభవిస్తాను—

గౌత—(నవ్వి) ఒద్దు చెన్నా - నాసంగతి ఇంటి దగ్గర చెప్పేందుకైనా నువ్వు వెళ్లాలి - ఇది తప్పదు - చెన్నా తండ్రిగారికి చెప్పు - వారికి నా కడసారి నమస్కారమని. యశోధరకు చెప్పు - ఈ దౌర్భాగ్యుణ్ని చేపట్టి ఆమె యీ కష్టాలకు గురికావలసి వచ్చిందని. నన్ను ఇందుకు క్షమించ మను. కుర్రవానికి నా ముద్దులని చెప్పు చెన్నా! నాకు వారిని బాధిద్దామనిలేదు. వారు విచారపడటంకూడా_మృత శరీరానికి కార్చే కన్నీరు లాంటిదని చెప్పు - ఎన్నాళ్ళు

అనుభవించినా - యీ తీరని కోరికలకు మితి ఉంటుందా? (కాస్త ఆగి) చూడు చెన్నా! తెల్లగా తెల్లవారింది. తూర్పు రేఖలు ఎరుపెక్కుతున్నై. ఇంక వెళ్ళు చెన్నా—

చెన్న—(ఆత్రుతతో) ప్రభూ!...ప్రభూ! మీ పాదాల కడ నాకు చేరెడంత మేరను ఇవ్వాలి—

గౌత—నీకు మతిపోతోంది చెన్నా! ఒక సామాన్య మానవుడికి ఇంత సేవా? నీకన్నీటితో నా పాదధూళిని కడుగుతావా! చెన్నా! మానవుడికి ఇంత హృదయ దౌర్బల్యం ఉండకూడదు. ఇదే నాకడసారిచూపు—ఇంక తిరిగి వెళ్ళు చెన్నా! ఇది నా ఆజ్ఞ.

చెన్న—ప్రభూ! ఇది కఠోరశిక్ష.

గౌత—కాదు-నా వీడ్కోలు-

(మెల్లిగా నడిచి వెళ్ళిపోయ్యాడు)

చెన్న—(పెద్దగా) ప్ర-భూ!...ప్ర - భూ!...

(అడవి ప్రతిధ్వనించింది. గుర్రాలు బాధగా సకిలించినయ్.)

—ఏప్రిల్, 1941

# అశ్వత్థామ

ఊరుభంగానికి గురయినసుయోధనుడు వైశంపాయన మడుగు ప్రక్కన పడిఉన్నాడు. అశ్వత్థామ, కృపాచార్యులు కృతవర్మ రథాలమీద ఆ ప్రదేశానికి వచ్చారు]

అశ్వ—కృపా; కృత:—ప్రభూ!...ప్రభూ!

దుర్యో—(మెల్లిగా కళ్ళు తెరిచి, తెలివి తెచ్చుకుంటూ) ఎవరూ?...అశ్వత్థామా!...కృపాచార్యా!... కృతవర్మా! వచ్చారా?

అశ్వ—ఈ దుస్థితి...

దుర్యో—(నిర్లక్ష్యంగా నవ్వి) అవును—అశ్వత్థామా!

అశ్వ—మహారాజుల సేవలో కాని సంచరించని ప్రభువు ఈ నాడు దిక్కులేక ఈ కొలను ఒడ్డున పడవలసి వచ్చిందా? బంగారు సింహాసనాలమీద, హంసతూలికా తల్పాలమీద మేనువాల్చే ఏలిక ఈనాడు—మానవులు కాలితో తన్ని మలినంచేసిన మట్టిలో దొర్లవలసి వచ్చిందా? సూర్యరశ్మి ఏ క్షణానా తాకని మహారాజుశిరస్సును ఈనాడు సూర్యుడు నవ్వుతూ చూడవలసివచ్చిందా?ఒకవైపున అనుభవంతో తల నెరిసిన భీష్ముడు, ఇంకొకవైపున సకలాస్త్ర విద్యాపారంగతుడు ద్రోణుడు, వేరొకవైపున ధానశూరుడు వీరుడు కర్ణుడు, కొలుస్తూండగా రాజశ్రీని లోకానికి తెలియజేసిచే చక్రవర్తి

కేనా—ఈ నాడు ఒక్క ప్రకృతిమాత మాత్రమే దిక్క వటం?...

దుర్యో—ఇందులో ఆశ్చర్య మేముంది అశ్వత్థామా? చంచలస్వభావ శ్రీ ఈ నాడు నన్ను విడిచింది. ఏ నాడో బ్రహ్మరాసిన మోదఖేదములు జీవితంలో పర్యాయాలేగా; రాజులకైనా, రారాజులకైనా ప్రకృతిఒకటే! ఒకనాడు అనుకున్నాను - భూచక్రమంతా ఏకఛత్రాధిపత్యంలో ఏల గలనేమోనని, కాని విధి నాకు తన నవ్వుముఖాన్ని చూప లేదు. అశ్వత్థామా! నా స్వార్థంకోసం కొన్నివేల ప్రాణులు బలయ్యాయి.

అశ్వ—ప్రభూ! ఇంటికి వెళ్లామా?

దుర్యో—ఇంటికా? అశ్వత్థామా! నీ ఆదరానికి కృతజ్ఞత, నాస్థితిచూడు...ఇంక కొన్ని గడియలవరకే నేను యీ లోకంలో ఉంటాను...కాని అశ్వత్థామా! నేను మృత్యు వుకు భయపడేవాణ్ని కాదు. పంచపాండవుల్లో ఒక్కొక్కణ్ని మాత్రం నేను గదా యుద్ధంలో గెలువగలిగితే నాజీవితం ధన్యమయ్యేది. అందుకే నేను చిన్ననాటినుంచీ గదా యుద్ధంలో శ్రమచేశాను...ఈ నాడు ఒక్కణ్ని కలిసి పది మంది నిరుత్సాహపరుస్తూ...కృష్ణుడితోపాటు తాముకూడా భీముణ్ని ఆ ధర్మయుద్ధానికి ప్రోత్సహించి ఊరుభంగం చేయించారు. అశ్వత్థామా! లోకానికి మీరు చెప్పండి— ఆ ధర్మయుద్ధంలో మాత్రమే భీముడు సుయోధనుణ్ని గెలువ

గలిగాడని. అంతతో పోక — కురుదేశ రాజ్యాభిషిక్తమైన శిరస్సును తన్నాడు! అశ్వద్ధామా, ఇంత కన్న మీ రారాజుకు పరాభవ మేముంటుంది?... కాని గురుపుత్రా! వాడు తన్నగలిగింది — నేలకూలిన శత్రువును మాత్రమే! కోరలు లేని పామునోటిలో వేలు పెట్టిన ధీరుడు! నాన్నకూ, అమ్మకూ చెప్పండి: తను ముద్దుబిడ్డడితలను, భీముడనే సామాన్యయోధుడు తన్నగలిగాడని! ఆ ధర్మ దేవత లోకమంతటా విహరిస్తున్నాడు, ఏలికలకు మాత్రం న్యాయమెక్కడుంటుంది?–

అశ్వ—(ఉద్రేకంలో) విచారించకండి ప్రభూ! నేనిదే శపథాన్ని చేస్తున్నాను — నా బొందిలో ప్రాణం ఉన్నంత వరకూ...ఏలికను అగౌరవించి, ఆ ధర్మదేవతకు ఆరాధించే ఆ పాండవులు భూమండలంలో ఎక్కడ ఉన్నా నిద్రపోలేరు, రారాజా! ఇదే దైవంతోడుగా ప్రమాణం చేస్తున్నాను. ఆ టక్కరి కృష్ణుని కళ్ళఎదుట - పాండవులు బంధుమిత్రసమేతంగా అశ్వద్ధామ ఖడ్గాహతికి ప్రాణహీనమైన శరీరాల్తో నేల వ్రాలటాన్ని లోకానికి విశదపరుస్తాను.

దుర్యో—(అశ్వద్ధామను దగ్గరిగా లాక్కుంటూ, వీపు తట్టి) అశ్వద్ధామా! నువ్వు నిజమైన విశ్వాసాన్ని వెల్లడి చేశావు. నేను నీశపథాన్ని తీర్చుకొనేవరకూ బతికిఉండక పోయినా — నీ శపథవాక్యాలు నాకు కర్ణామృతంగా ఉన్నాయ్. నీ ప్రమాణాన్ని నిలబెట్టుకున్నప్పుడు నా ఆత్మ శాంతితో అనంత ఆనందాన్ని అనుభవిస్తుంది.

అశ్వ— ఇన్నాళ్ళుగా, ఇన్నాళ్ళుగా నూ సంసారాన్ని కడుపులో పెట్టుకు కాపాడుతూన్న రారాజుకు ఇదొక విశ్వాస మేనా? ఎవరి ఉప్పుతిని ఈశరీరం పెరిగిందో వారికి ఈ దేహాన్ని అర్పించటంలో ఘనత ఏముంది ప్రభూ? నా దేహంలోని తుది రక్తబిందువుకూడా 'సుయోధన చక్రవర్తిసేవ' అని ఘోషిస్తూ ఉంటుంది—

దుర్యో—అశ్వత్థామా! ఇన్నాళ్ళూ నిన్ను అర్థం చేసుకోలేకపోయ్యాను. నీశక్తీ, ఆత్మవిశ్వాసమూ తెలియక, నిన్ను సర్వసేనానిగా చేసేందుకు భయపడ్డాను.... ఇప్పటికైనా మించిపోయిందిలేదు. పాండవ—కౌరవయుద్ధం ఇంకా ముగియలేదు. పదకొండు అక్షౌహిణీల సైన్యానికిగాను ముగ్గురు మాత్రమే బతికిఉన్నారు. ఐనా నిరుత్సాహపడవద్దు. మిగిలిన ఇద్దరిమీదా నీవు సర్వసేనానివి. ఎక్కడైనా కౌరవరక్తం జీవకణాలతో ఉంటే దానిపైన అధికారంనీది! నీతండ్రి అర్జునుడికికూడా నేర్పని అస్త్రవిద్య నీకు నేర్పాడు. గురుకుమారా! నీవుఎర్రపడ్డకంటిని తెరిచిన క్షణాల్లో— ఆ దృష్టి ఎదుట పాండవులు వెయ్యిమందైనా దగ్ధమౌతారు! సందేహం లేదు—

కృపాచార్యా! ఆకుదొన్నెతో కొలనులోని నీటిని తీసుకురండి.

(కృపాచార్యుడు తెచ్చిన నీటిని అశ్వత్థామ తలపై చల్లి) ఇదే అశ్వత్థామను కౌరవశేషితసేనకు సర్వసేనానిగా చేస్తు

న్నాను. కృతవర్మా! కృపాచార్యా! అశ్వద్ధామ ఆజ్ఞలు యీక్షణంనుంచీ నావిగానే భావించండి—

కృత : కృపా—చిత్తం ప్రభూ!

అశ్వ—రారాజా! నేను ధన్యుణ్ని (నమస్కరించాడు)

దుర్యో—నీలాంటివీరుడికి ఇదొకగౌరవమా? అశ్వద్ధామా ఆనాడు పాండవులు కుతంత్రముతో గురువుగారియెడ చూపిన అనాదరము, అస్త్రసన్యాసము చేసిన పూజ్యపాదుణ్ని యుద్ధ రంగంలో తలకోసినసంగతి మరిచావా?

అశ్వ—(క్రోధంతో) ప్రభూ! మరుస్తానా? హృదయం ఉన్నవాడెవడు మరిచిపోగలడు? దానిఫలితమే పాండవుల మెడకు—అశ్వద్ధామ వెయ్యబొయ్యే ముడివిడనిఉరిత్రాడు! చక్రవర్తీ; అశ్వద్ధామ క్రోధాగ్నికి పాండవులు మిడుతలు కాగలరు!...సుయోధన చక్రవర్తికి జయము తప్పదు—

దుర్యో—అందుకు సహాయపడమని దైవాన్ని ప్రార్థిస్తు న్నాను...

అశ్వ—ప్రభువు దయారస వాహిని యీ నా డునాపై పూర్తిగా ప్రవహించింది. చక్రవర్తీ! మీకన్నా నాకు యీలోకంలో వేరొక ఆత్మబంధువులేడు!

దుర్యో—అశ్వద్ధామా! ఇంకెంతసేపు నా ప్రాణాలుం టవి? దిక్కులేని మృత్యువు పాలవుతానసుకొన్నాను. కాని మీలాంటి యోధుల సమక్షంలో మరణించటం నాకు ఆనం దంగానే ఉంది అమితోత్సాహంతో యుద్ధంచేసి—బంధు

వులు, మిత్రులు, పుత్రులు, భ్రాతృలు—ఇంతమంది మరణిం చగా—నేనొక్కణ్నే బతికిఉండి సర్వసౌఖ్యాల్నీ అనుభవిం చటం మాత్రం ఏం ధర్మం? అతిరథమహారథులనుకోల్పోయి సర్వనాశనానికీ నడుంకట్టిన నన్ను మృత్యువు మాత్రం ఏం బెదిరిస్తుంది ? నా బంధుమిత్రులకు నా అభివందనాలు, అశ్వత్థామా ! లోకానికి చాటు—కౌరవ అస్తమయం కాలేదని—

అమ్మకూ, నాన్నకూ నా కడసారి నమస్కారాన్ని అంద జెయ్యి...(క్షణం ఆగి) అవిగో - వీరస్వర్గకవాటాలు నాకో రకుగాను తెరుచుకుంటున్నాయ్. యుద్ధంలో నేలకూలిన నా బంధుమిత్రులు నన్ను పిలుస్తున్నారు, రంభా, ఊర్వసులు నవ్వుముఖంతో నన్ను ఆహ్వానిస్తున్నారు. ఆ స్వాగతగీతాల్ని అందుకుంటాను...

అశ్వ—(క్షణం ఆగి) రారాజా!

కృపా—రారాజు పరలోకాల పాలయ్యాడు.

అశ్వ—ఎంత బతుకు బతికాడు! ఎంతెంతవారికి ఎం తెంతదుర్దశ ?

కృత—మృత్యువుకు చక్రవర్తులంటేమాత్రం దయ దేనికి?

అశ్వ—రారాజు అంత్యక్రియలుచేసి బయులుదేరుదాం.

కృత—ఎక్కడికి ?

అశ్వ—నా ప్రమాణాన్ని క్రియారూపాన చూపేం దుకు...కౌరవనాథుని ఆజ్ఞను మరువలేదుగా ?

కృత: కృపా—లేదు - సర్వసేనానీ!

## 2

[క్రీకారణ్యము. అర్ధరాత్రి, చీకటిని వెలుగుకు మార్చలేని నక్షత్రాలు నీలాకాశంలోంచి తొంగి తొంగి తొంగి చూస్తు న్నాయ్. మిణుగురుపురుగులు అక్కడక్కడ మెరుస్తు న్నాయ్. రాత్రి సంచారం చేసే పక్షులు, జంతువులు రొద చేస్తున్నాయ్. వటవృక్షంకింద కృపాచార్యులు, కృతవర్మ డస్సి నిద్రపోతున్నారు. అశ్వద్ధామ మేలుకొని గాఢంగా ఆలోచిస్తున్నాడు.]

అశ్వ—మామా! లే...కృతవర్మా; ఇది నిద్రకు సమ యంకాదు...మేలుకో (ఇద్దర్నీ కాపాడు)

కృత—అశ్వద్ధామా! ఎందుకు మేల్కొల్పావ్?

కృపా—నువ్వు నిద్రపోనేలేదా?

అశ్వ—నిర్లక్ష్యంగా నవ్వి!) నిద్రా?—కోపావేశంతో కుములుతూన్నవానికీ, తీవ్రకాంక్షతో బాధపడుతూన్నవా నికి నిద్ర ఎందుకుస్తుంది?...మామా! నేనిప్పుడు ఏంచూశా ననుకున్నావు?

కృపా—నిద్రపోతూన్న మాకెలా తెలుస్తుంది?

అశ్వ—వినుమామా! ఒక గుడ్లగూబ - యీ అర్ధ సమయానవచ్చి ఈ వృక్ష శాఖలపై నివాసంచేస్తూ - యీ రాత్రివేళ నిద్రపోతూన్న అనేక కాకాల్నిచంపింది. ఒక్క

పక్షి - ఎన్ని పక్షుల ప్రాణాల్ని తియ్యగలిగిందో చూశావా మామా ?

కృపా—ఇందులో ఆశ్చర్యమేముంది అశ్వత్థామా?

అశ్వ—అదికాదుమామా ! మానవుడు బుద్ధిహీనుడై నపుడు పక్షులు పాఠాన్ని చెప్తున్నాయ్. పాండవుల్ని పుత్ర, మిత్రసైన్య సమేతంగా మట్టు పెట్టేందుకు ఇది మంచి సమయంకాదా మామా ?

కృపా—అశ్వత్థామా ! ఏమంటున్నావు ? రాత్రి నిద్రపోతూన్న వారిని వధించ కూడదా అని అడుగుతున్నావా ?

కృత—ఈమాత్రం ఆలోచనకు అర్ధరాత్రిదాకా మేలుకొని కూర్చోవాలా ?

అశ్వ—అవును. మీకు కార్యభారం లేకపోవటంచేత హాయిగా నిద్రపోతున్నారు. పాండవుల్ని చంపి తీరుతానని రారాజు అంత్యక్షణాల్లో ప్రమాణం చేసినవాణ్ని కావటం వల్ల—నాకొక బాధ్యతవుంది.

కృపా—కాని అశ్వత్థామా ! తొందరపడకు...ప్రతి కార్యానికీ ముఖ్యమైనవి పౌరుషము, విధి అనేవి రెండు. పౌరుషంగా పట్టుదలతో పోరాడే వానికి విధి అనుకూలిస్తుంది. అంతే కాదు—అన్యాయమైనవి, సజ్జనులకు హాని కలిగించేవి అయిన పనులెప్పుడూ శ్రేయస్కరం కాదు. బతికిన నాలుగు రోజులూ అక్రమ కార్యాల్ని చేసి అపకీర్తి పాలవటం దేనికి? నువ్వు యీ క్రోధావేశంలో అవినతి కార్యాన్ని

చేసి కృతకృత్యుడివైనా నీ గుండెల్లో భయంగానే ఉంటుంది అందుకుముందు ఎన్నో కీడులుంటవి. కోపము, లోభము, భయము—యీ మూడిటితో బాధపడుతూన్న మనస్సుతో చేసే ఏపని సత్కార్యమనదు—

అశ్వ—మరి కర్తవ్యమేమిటి మామా?

కృపా—రారాజు వివేక విహీనుడై క్రోధ లోభములతో, హితులెన్ని చెప్పినా వినక—తన రక్త స్పర్శవున్న పాండవులకు తుదకు ఐదు ఊళ్ళనుకూడా ఇచ్చేందుకు ఒప్పక—మరభిమానంతో మొండి పట్టుపట్టి, అన్ని నిందలకూ, అపకీర్తులకూ, సిద్ధమై సాధుచిత్తులైన పాండు సుతులమీద కత్తిదూశాడు. అతనికి సర్వనాశనం తప్పదని ఏనాడో అందరూ అనుకున్నారు...ఆ రారాజు పోనేపోయ్యాడు. ఇక మన కర్తవ్యమంటావా?—మనం ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి పరిస్థితుల్ని వినిపిద్దాం. అతడు గాంధారితోనూ ఆలోచించి విధించిన కర్తవ్యాన్ని ఆజ్ఞగా శిరసావహిద్దాం—

అశ్వ—ఇదేమి కర్తవ్యం మామా? నా హృదయం కోపశోకాలతో ప్రజ్వరిల్లుతోంది. మిన్నుముట్టే ఆ జ్వాలలనడుమ పాండవులు పడితేనేకాని, అవి అరవు. నువ్వు చెప్పేదే నీకు న్యాయంగా తోస్తోంది. ఇతరుల మాటలన్నీ అధర్మాలకింద పరిగణిస్తావు. చిన్నవాణ్ణని నాకు నీతులు ఉపదేశించబోక మామా! ఆపదల్లో పడ్డమానవుడు—నిలకడలేని హృదయంతో తనది ధర్మ పథం కాదేమోనని భయపడటం సహజమేగా!

కృపా—ఇప్పుడు ఏమంత ప్రమాదం అశ్వత్థామా?

అశ్వ—ఇంకా ప్రమాదం లేదంటున్నావా మామా? చేతులుకాలాక ఆకులు పట్టుకొని ఏం లాభం?...బీద ఇంట పుట్టి కూటికికరువై అల్లాడుతూన్న మాకుటుంబాన్ని రారాజు జేరదీసి, ఏలోపమూ లేకుండా కడుపులో పెట్టుకు కాపాడాడు. అట్టి రారాజుకోసం నేనేం త్యాగం చెయ్యకూడదు? ఆ చక్రవర్తి ఎదుట చేసిన ప్రమాణాన్ని నిలబెట్టుకోవటంకన్నా నేను అతనికి చూపవలసిన విశ్వాసమెక్కడ? అంతేకాదు మామా! అస్త్రసన్యాసంచేసిన నాతండ్రి తలను కోసి—విజయలక్ష్మిని గ్రహించాననే గర్వంతో హాయిగా నిద్రపోతూన్న ధృష్టద్యుమ్నుణ్ని హతమార్చకుండా నిద్రపోనా? ఏకైక పుత్రుడికి ఇంతకన్న అవమానం వుందా? నాతండ్రి అవమానాగ్నితో స్వర్గంలోకూడా బాధపడుతూండగా—నేను గాజులు తొడిగించుకొని కూర్చుంటా ననుకున్నావా?

కృపా—అశ్వత్థామా! నువ్వు చెప్పింది కాదనను. కాని పద్ధెనిమిదిరోజులు ఏకబిగిని యుద్ధంచేసి అలసిఉన్నావు. ఆ అలసటను తీర్చుకుంటూ రాత్రి నిద్రపో, రేపు ఉదయానే వెళ్ళి పాండవుల్ని ఎదుర్కొందాము. ఆపనిని దేవతలుకూడా శ్లాఘిస్తారు.

అశ్వ—ప్రాణాలమీగ అంతతీపి దేనికి మామా? పుట్టిన నాడే మరణం రాసిఉన్న మనం— ఆ మృత్యువును రారాజుకే కైంకర్యం చెయ్యకూడదా?—మామా! నువ్వు పిరికితనాన్ని వేరొకరూపంలో చూపుతున్నావు.

కృపా— చావుకు భయపడుతున్నా ననుకున్నావా అశ్వత్థామా ? రారాజు సేనకు సిద్ధమైననాడే ఆ ఆశను వదలుకొన్నాను. రేపు ఉదయాన్నే పాండవులతో యుద్ధం చేసి—వారి నాశనాన్నో, మన నాశనాన్నో తేల్చుకుంటాము.

అశ్వ—(నవ్వి) పాండవులు జాగ్రదావస్థలో శ్రీకృష్ణుని సహాయంతో ఉండగా, యాభైమంది అశ్వత్థామలు, వందమంది కృపులు, రెండువందలమంది కృతవర్మలూ కలిపినా—వారిలో ఒక్కరినీ మట్టుపెట్టలేరు. అందులో పదకొండౌక్షౌహిణీల సైన్యాన్ని కోల్పోయిన మనం నిరుత్సాహపడి ఉన్నాము. ఈ సౌప్తికసమయం కాక, ఇంక ఏ ఇతరసమయాన పాండవులు మనకు అజేయులు...అంతేకాని నిద్ర పేరిట నన్ను నిరుత్సాహపరచొద్దు మామా !

కృత—అశ్వత్థామా ! ఈమాటకూడావిను : నీకు అత్యధికకోపంలో ఒళ్ళు తెలియటంలేదు; ఇతరులు చెప్పేదికూడా చెవిదూరటంలేదు. రారాజు ఇలా వినకనే మనకళ్ళెదుట చెడ్డాడు. నీ ప్రతిజ్ఞాపాలనానిక్కూడా సమయాలున్నాయ్. నిద్రావస్థలో ఉన్నవారినీ, ఆయుధాల్ని సర్జించినవారినీ, వాహనవైకల్యానికి గురైన వారినీ, శరణు జొచ్చినవారినీ వధించటం ధర్మంకాదు. పాండవులు తమ సేనలతో అలసి నిద్రపోతూన్న సమయమిది. నిద్ర మరణంతో సమానమైంది. అట్టి మరణావస్థలో ఉన్నవారినేనా చంపి కీర్తిసంపాయించటం ? మహా భారతవీరుల్లో ఒకడివైన నీకు యీకళంకంతప్పదు. సూర్యునివలె ప్రకాశిస్తూన్న నువ్వా—యీ

పనితో రేపు సూర్యోదయానికల్లా శాంతి విహీనుడై వాతావు—

అశ్వ—కృతవర్మా! ఇది నిజమే! ...కాని పాండవులు మాత్రం ఏమంతధర్మంగా ప్రవర్తించారు? ఆ శిఖండిని అడ్డంపెట్టుకొని—సర్వజనులకు పూజనీయుడు, తమకు పితామహుడు అయిన భీష్ముణ్ణి నేలకూల్చారు. భూమిలోకి కుంగి పోతూన్న రథాన్ని భుజబలంతో ఎత్తుకుంటూన్న కర్ణుని మీద అస్త్రప్రయోగంచేసి వీరస్వర్గానికి పంపటం న్యాయమా? గురువు, పూజ్యపాదుడు అయిన ద్రోణుడు అస్త్ర సన్యాసుల చేసినపుడు తలనరికారే ఆసమయాన ఏ ధర్మాలు అడ్డుపడ్డాయ్? ఈనాడు పంచపాండవులు చుట్టుముట్టి, కురు నాథుణ్ణి నిరుత్సాహపరుస్తూ—భీముడిచేత తొడలు విరగ గొట్టించినపుడు ఏ ధర్మశాస్త్రాలు ఒప్పుకున్నాయ్? అంతతో పోనిక-కురుక్షోణి రాజ్యాభిషిక్తమైన-సుయోధనుని మస్త కాన్ని కాలితో భీముడు తన్నటంకూడా న్యాయమేనా? హృదయం ఉన్నవాడెవడు-వీటిని న్యాయాలుగా చెప్పగలడు?

(కోపావేశంతో) మామా! కృతవర్మా!

ఇక అశ్వత్థామ ఆగలేడు. ఈ రాత్రి పాండవరక్తస్రవంతిలో హాయిగా స్నానం చేస్తేనేకాని నాకు నిద్రపట్టదు. పాండవ సంబంధమైన పీనుగుల పెంటలపై భూతాలు స్వేచ్ఛగా నృత్యం చెయ్యాలి. పాండవుల ఏనుగులు, రథములు, గుర్రములు — ఒకటేమిటి — వారి సర్వస్వమూ భూమాతపైన తెగిపడతై. ధృష్టద్యుమ్నుని యజ్ఞపశువువలె ఖండఖండాలుగా నరికి—ఆ మాంసఖండాలతో కాకులకూ

గద్దలకూ విందుచేస్తాను. అంతవరకూ అశ్వద్ధామను ఎవ్వరూ ఆపలేరు.

ఈ సమయం కాస్తా దాటిపోతే మనం పనికిరాము. మామా, కృతవర్మా! మీకు ప్రాణాలమీద తీపివుంటే మీరు రానక్కరలేదు ... కాని నేను మాత్రం వెళ్తున్నాను...రారాజు అంత్య ఆదేశాల్ని మరిచి పోయ్యారు కాబోలు!

కృత: కృపా—లేదు సర్వసేనానీ—

అశ్వ—సర్వసేనాని ఆజ్ఞాపిస్తున్నాడు—వెంటనే బయలు దేరండి—

కృత: కృపా—చిత్తం—

(రథాలు కదిలివెళ్తున్నాయ్)

# 3

పెద్ద మైదానంమీద పాండవ కుటీరాలు. అందరూ నిద్రిస్తున్నారు. అలికిడి లేదు. దీపాలు తమ క్రీనీడకాంతిని వెల్లడి చేసుకుంటున్నై. అశ్వద్ధామ, కృపాచార్య, కృతవర్మాలతో వొచ్చాడు.

అశ్వ—మామా! కృతవర్మా! మీరు బైటనే ఉండండి ...నిద్రలో నిమగ్నమైనవాళ్ని చంపని ధర్మవక్తలుకనుక—లోనుంచి ఎవరైనా ప్రాణాల్తో బైటపడితేమాత్రం—యమ సదనానికి పంపండి; లోపల నా పనిని పూర్తిచేసుకు వస్తాను.

కృత: కృపా—సరే...

(అశ్వద్ధామ ముందుకు వెళ్ళాడు)

అశ్వ—(ఆగి ఆశ్చర్యంతో) ఎవరీ సింహద్వారం దగ్గర! ...ఎక్కడిదీ భీకరాకృతి ? నన్ను లోనికి పోనివ్వదా ? దీని కళ్ళనుంచీ, చెవులనుంచీ, ముక్కులనుంచీ ఏమిటీ మిన్ను ముట్టే జ్వాలలు! ఈ వింతనుగూర్చి నేనెప్పుడూ వినసైనా లేదే! పోరాడి దీన్ని హతమార్చి ప్రవేశిస్తాను.

(బాణాల్ని ప్రయోగిస్తున్నాడు...అలసట జెందాడు)

ఎన్ని అస్త్రశస్త్రాల్ని ప్రయోగించినా, అగ్నికి ఆహుతయ్యే కట్టెలవలె అవుతున్నవే! నా బాహు బలమంతా దీనిముందు ఎందుకూ పనికిరావటం లేదు !...ఆశ్చర్యం ! ఇది భూతమై ఉండదు. నన్ను పరీక్షింప వచ్చిన దేవతా స్వరూపమేమో ? . (ఆలోచించి) ఈ ఆకృతి శరీరంపైని విభూతీ, క్రూరనాగాల్నీ పట్టి చూస్తే శివుడనే అనుమానం కలుగుతోంది భూతనాథుడేకాక, వేరొకరైనట్టయితే యీ పాటికి నాధాటికి నేలకూలేవారే !...భూతపతికి నేనేమి ఇవ్వగలను ? ఆహుతిలో—ఆత్మోపహారంకన్నా నా భక్తి ఎల్లా వెల్లడించగలను ?

(రథాన్ని విడిచి హోమం చేశాడు. ఆ మంటల ముందు అశ్వద్ధామ ఆకారం భయానకంగా వుంది)

అశ్వ-ఉమాపతీ! అశ్వద్ధామ భక్తిని పరీక్షిద్దామను కున్నావా ? ఇదుగో—అశ్వద్ధామ తనతలను నీ పాదాలవద్ద ఉంచటంకన్నా చెయ్యగల ఉపహారమేముంది ?

(కత్తిని మెడపైన పెట్టాడు; శివుడు ప్రత్యక్షమైనాడు.)

శివ—అశ్వద్ధామా ! ఆగు. నీ భక్తికీ, కార్యదీక్షకూ, పట్టుదలకూ సంతోషించాను.

అశ్వ—ఎవరూ? నీలకంఠుడే!...భ క్తవత్సలా! నాజన్మ తరించింది. (సాష్టాంగ నమస్కారం చేశాడు.)

శివు—నీరథమూ, అస్త్రాలూ ఎప్పటివలె వస్తవి. అశ్వద్ధామా! ఇదుగో యీ కత్తిని తీసుకో. ఈరాత్రి దీనికి ముల్లోకాల్లోనూ ఎదురుండదు. సూర్యోదయానికి దీని ప్రభావం పోతుంది. నీపని నిరాటంకంగా చేసుకొని వెళ్ళేప్పుడు దీన్ని యీ ద్వారందగ్గరే వదిలేసివెళ్ళు.

అశ్వ—(కత్తి తీసుకొని) కృతార్థుణ్ని. భూతపతికి యీనాడు తృప్తికరమైన నైవేద్యం తప్పదు.

శివు—ఇంక వెళ్ళు.

అశ్వ—(నమస్కరించి వెళ్తున్నాడు.)

(తెర)

# 4

(సేనాని ధృష్టద్యుమ్నుని కుటీరము. ధృష్టద్యుమ్నుడు. హంసతూలికాతల్పంమీద, గుండెలపై చేయివేసుకొని హాయిగా నిద్రిస్తున్నాడు. అశ్వద్ధామ అతనిపైకి ఉరికాడు)

అశ్వ—గురుద్రోహీ! లే!

ధృష్ట—(కలత నిద్రలో) ఎవరూ? అ–శ్వద్ధా–మ!

అశ్వ—(నవ్వి) అవును; జయలక్ష్మి రాకతో అశ్వద్ధామను మరిచావు కాబోలు?

ధృష్ట—అశ్వద్ధామా! అర్ధరాత్రి నిద్రిస్తూన్న వానిపైకి ఉరకటం—

అశ్వ—(నవ్వి) అస్త్రసన్యాసిపైకి ఉరికినప్పుడేమైంది ఆ ధర్మం?

ధృష్ట—పోనీ నాకు కత్తియిచ్చి పోరాడు—

అశ్వ—నీకా? నీలాటి పాపికా కత్తి? కత్తినిముట్టేం దుకూ కూడా అర్హతవుందీ? అస్త్ర సన్యాసినీ, గురువునూ యుద్ధరంగంలో తలకోసేందుకు కత్తి దేనికి?

ధృష్ట—పోనీ నన్ను ఒక్క దెబ్బతో స్వర్గానికి పంపు—

అశ్వ—నీలాటి పాపికా ఆ స్వర్గం? గురుద్రోహికి స్వర్గ మెక్కడరా? గురుద్రోహికి చిత్రవధ శిక్ష! నిరక్తాన్ని కుక్కలు కూడా ముట్టవు—(చిత్రవధ వేస్తూ) తండ్రీ! ఇదిగో గురుద్రోహి కన్ను! ముక్కు! చెవి! హస్తం! పుర్రె! శాంతి! తండ్రీ! శాంతి!'

## 5

ఆరాత్రి స్త్రీలను తప్ప, మిగతా అందరూ అశ్వత్థామ ఖడ్గానికి బలయ్యారు. నిద్రనుంచి మేల్కొంటూన్న వాళ్ళ కోలాహలాలూ, చావుకుదగ్గరై బాధపడుతూన్న వారి మూల్గులూ—విన్పిస్తున్నాయ్—]

అశ్వ—మామా! కృతవర్మా...ఇక వెళ్దాం పదండి...

(మూడురథాలూ కదిలివెళ్లిపోయినై)

## 6

[అరణ్యం...రథాలు ఆగినై]

అశ్వ—మామా! మనపనినిపూర్తి చేసికొన్నాము. కౌరవ బలగానికి మిగిలిన ముగ్గురమూ, రాత్రి పాండవసేనల్ని భీభత్స పరిచాము. కాని ఆ నల్లవాడు ఇదంతా కనిపెట్టే పాండవుల్ని ఎక్కడికో లాక్కుపోయ్యాడు. గతరాత్రి పాండవులే కుటీ

రాళ్లో వున్నట్టయితే—భూమాత వారి రక్తంతో స్నానం చేసివుండేది...అదృష్టవంతుల్ని చెరచగలిగేదెవరు ?

కృపా—తెలిసివుండికూడా పాపానికి ఒడిగట్టావు—

అశ్వ—కాని నేను శపథంచేశాను మామా! నేను విధిగా పగదీర్చుకోవాల్సిన ఆధృష్టద్యుమ్నుణ్ని చిత్రవధ చేశాను. శిఖండిని యమలోకానికి పంపాను. రారాజు అంత్య కోర్కె ప్రకారం పాండవసంబంధిత రక్తాన్ని కాల్వలుగా ప్రవహింపజేశాను. ఉపపాండవుల తలలన్నీ భూమిమీద పడిన్నై. పాండవుల ఏనుగులకాళ్ళను నరికాను; గుర్రాల మెడల్నికోశాను. శాల్బలమంతా శాశ్వతనిద్రకు గురైంది. స్త్రీలను తప్ప—ఇంకెవర్నీ వదలలేదు. కురుభూపతి ఆత్మకు శాంతిః స్వర్గంలోంచి రారాజు యీ దృశ్యాన్ని చూసి తృప్తిగా నవ్వి ఉంటాడు—

కృత—ఇంతకూనువ్వు సాధించిందేమిటి—అశ్వద్థామా ?

అశ్వ—(నవ్వి) పాండవులకు మిగిలింది మాత్రమేముంది? మహాభారతయుద్ధంలో వారు తమ బంధుమిత్రుల్లో చాలా భాగాన్ని కోల్పోయారు. ఐదుగురిపొట్టకోసం ఎన్ని జీవ రాసులు హతమయినవో చూడు. ఇప్పుడు వారిని జయ లక్ష్మి వరించినా - వారు యీ స్మశానవాటికలకు ప్రభువులు; ఆ పీనుగుపెంటలకు అధికారులు! నిర్మానుష్యమైన కరిపురా నికి ఏలికలు! నిస్సారమైన భూమి, ఘోరున ఏడ్చే ప్రకృతీ వారిదీ! ఇంక అనుభవించమను - ఆ గెల్చిన రాజ్యాన్ని !

కృపా—అశ్వద్ధామా! నీకు హృదయంలేదు... రాత్రి నువ్వు చేసినపనిని ఏ ధర్మశాస్త్రమూ ఒప్పుకోదు—

అశ్వ—అవును మామా! నేను పాపాన్నే చేశాను. దానికి ఇప్పుడు పశ్చాత్తాప పడుతున్నాను. నిద్రాముద్రిత లోకంలో ప్రళయకాలుని రూపాన విహారం చేశాను. ఇది నాకూ నావంశానికీ తీరని కళంకం! ఈ ప్రభాతంలో — నా కీర్తి పౌరుషమూ, వీరత్వమూ — అన్నీ లోకానికి విశద మౌతాయ్. అశ్వత్థామను గూర్చి ప్రజలు చెప్పుకొని నవ్వుతారు. ఇన్నాళ్ళబతుకూ పాడైంది...కాని నా సర్వస్వాన్నీ రారాజుకు త్యాగంచేశాను.

కృపా—పోనీ అశ్వత్థామా! ఐపోయినదాన్ని గూర్చి ఇప్పుడు విచారించి ఏం లాభం? కర్తవ్యాన్ని ఆలోచించు—

అశ్వ—ఆలోచించాను మామా! లోకమంటే నాకు విరక్తికలిగింది. ఒంటరిగా మిగిలాను. అరణ్యాలకు పోయి తపస్సు చేసుకుంటాను. తూరుపు తెల తెల నవుతోంది. సూర్యోదయానికి పాండవులువచ్చి, రాత్రి జరిగిన దుర్మార్గాన్ని తెలుసుకొని మనను వెన్నంటుతారు. మీకు ప్రాణాల మీద ఆశేవుంటే మీదారి మీరు చూసుకోండి. ఇక్కడ నాలుగుదార్లు కలుస్తున్నవి. నేను ఉత్తరదిశ వెళ్తాను—ఎంత దూరమో తెలియదు; ఎక్కడకో తెలియదు—

కృత—గొప్ప వేదాంతివయ్యావేమిటి అశ్వత్థామా!

కృపా—ఈపాటి ధైర్యానికేనా రాత్రి అంత అట్టహాసం చేసింది?

అశ్వ—నాకు భయంలేదు మామా! నాతలలోని మణి నాకు మృత్యుభయం లేకుండా చేసింది. అశ్వద్ధామ చిరంజీవి!...ఇక పాండవులతో కూడా యుద్ధం చెయ్యదల్చుకోలేదు. ప్రశాంతజీవితాన్ని గడపటమే నా ఆదర్శం. అందుకే యీ పన్నాగం...

కృపా—మమ్మల్ని ఏం చెయ్యమంటావు—సర్వసేనానీ?

అశ్వ—హాస్యాలాడబోక మామా! నా సర్వసేనానత్వము ఐపోయింది. మీదారి మీది—నాదారి నాదీ! నేను మాత్రం వెళ్తున్నాను—

(అశ్వద్ధామ రథం సాగిపోయింది)

కృ—కృతవర్మా! మనవారు మనమెడలను ఉరితాళ్ళను తగిలించి వాడిదారి చూసుకొన్నాడు.

కృత—పాండవులువస్తే, మనతలలు భుజాలమీదవుండే ఆశ లేదు—

కృపా—కర్తవ్యం?

కృత—అశ్వద్ధామే దారిచూపాడు. పలాయనమంత్రపఠనంకన్న మంచిపని లేదు.

కృపా—సరే నువ్వు అటూ—నేను ఇటూ

(రెండు రథాలూ కదిలిపోయినై)

(తెర)

---

ఆగష్టు, 1941

# శ్రీ మహాభారతము: వచనము

## మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

### 18 పర్వములు - 16 సంపుటములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | | 4 | 0 | 0 |
| సభాపర్వము | | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము | 1 వ భాగము | 3 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 3 | 0 | 0 |
| విరాటపర్వము | | 2 | 8 | 0 |
| ఉద్యోగపర్వము | | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | | 3 | 0 | 0 |
| కర్ణ పర్వము | | 2 | 0 | 0 |
| శల్యపర్వము | | 1 | 8 | 0 |
| సౌప్తికపర్వము | | 0 | 12 | 0 |
| స్త్రీపర్వము | | 0 | 8 | 0 |
| శాంతిపర్వము | | 4 | 8 | 0 |
| అనుశాసనికపర్వము | | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | | 1 | 4 | 0 |

పూర్తి సెట్టు వెల రు 37—8—0

## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాంతం కైఫీయతు | 1 | 0 | నేనూ మాకాంతం | 1 | 0 |
| మునిమాణిక్యంనాటికలు | 1 | 0 | మునిమాణిక్యం కథలు | 1 | 0 |
| ఉపాధ్యాయుడు | 1 | 0 | కాంతం కాపురం | 1 | 0 |
| శరద్రాత్రులు | 1 | 0 | దీక్షితులు | 1 | 0 |
| రుక్కుతల్లి | 1 | 0 | తగూ నెంబరు శ్రీ | 1 | 0 |
| యథార్థ దృశ్యాలు | 1 | 0 | వినోదవ్యాసములు | 1 | 0 |
| కాంతం | 1 | 0 | నా స్నేహితులు | 1 | 0 |
| హాస్యకథలు | 1 | 0 | దాంపత్యజీవితము | 1 | 0 |
| తల్లిప్రేమ | 1 | 0 | రేడియో నాటికలు | 1 | 0 |
| కథానికలు | 1 | 0 | రాధబాబు | 1 | 0 |
| తిరుమాళిగ | 1 | 0 | మేరీ కహానీ | 1 | 0 |

## శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాలక్షేపం 1 వ భా॥ | 1 | 0 | మాయలమాలోకం | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | అవును | 1 | 0 |
| గుసగుస పెళ్ళి | 1 | 0 | నిజం | 1 | 0 |
| ఇప్పుడు | 1 | 0 | మాటవరస | 1 | 0 |
| అప్పుడు | 1 | 0 | తనలో | 1 | 0 |
| అన్నీ తగాదాలే | 1 | 0 | మేజువాణీ | 1 | 0 |
| రెండు రెళ్ళు | 1 | 0 | మన తెలుగు | 1 | 0 |
| పెళ్ళి ట్రెయినింగ్ | 1 | 0 | లోకోభిన్నరుచిః | 1 | 0 |
| రాక్షసగ్రహణం | 1 | 0 | చెప్పలేం ? | 1 | 0 |
| వసంతసేన | 1 | 0 | ఈడూజోడూ | 1 | 0 |
| ప్రణయరంగం | 1 | 0 | వినయప్రభ | 1 | 0 |

## శ్రీ ధనికొండ హనుమంతరావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| తీర్పు | 1 | 0 | ప్రణయాన్వేషి | 1 | 0 |
| పవిత్రులు | 1 | 0 | దేవకన్య | 1 | 8 |
| ఇలవేల్పు | 1 | 8 | అనాథ | 1 | 8 |
| జ్ఞాని | 1 | 0 | అపనింద | 1 | 0 |
| బుద్ధిశాలి | 1 | 0 | చక్రి | 1 | 0 |
| ప్రమాదాలు | 1 | 0 | స్వార్థపరులు | 1 | 0 |
| కుక్కతోక | 1 | 0 | యుద్ధఖైదీ | 1 | 0 |
| ప్రియురాలు | 1 | 0 | గొడ్రాలు | 1 | 0 |
| సంజీవి | 1 | 0 | ఎర్రబుట్టలు | 1 | 8 |
| గర్వభంగం | 1 | 0 | సేవిక | 1 | 0 |
| పరిశోధన | 1 | 0 | శిక్ష | 1 | 0 |
| కాముకి | 1 | 0 | మధురకల్యాణం | 1 | 0 |
| లోకచరిత్ర | 1 | 8 | | | |

## శ్రీ చందూరి నాగేశ్వరరావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| భానుమూర్తి భార్య | 1 | 0 | మహాబలిపురం | 1 | 0 |
| మాంగుళూరు మెయిల్ | 1 | 0 | నట్టింట దీపం | 1 | 0 |
| అంతేనా | 1 | 0 | భాష | 1 | 0 |
| ఆఖరుకోరిక | 1 | 0 | కొన్ని గ్రంథాలు | 1 | 0 |
| కాఫీ మానెయ్యడం | 1 | 0 | పరిచయం చేసిన పుస్తకాలు | 1 | 0 |
| ఎక్కడికి కమలా? | 1 | 0 | మనకీ ఒక కారు | 1 | 0 |
| అన్యాయం | 1 | 0 | క్రొత్తలోకాలు | 1 | 0 |
| శివరావు | 1 | 0 | సీతతో సినిమాకి | 1 | 0 |
| కలడో లేడో | 1 | 0 | | | |
| రాధ నవ్వింది | 1 | 0 | | | |

## శ్రీ జి. జాషువాకవిగారి ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఖండకావ్యము 1వ భా॥ | 1 | 0 | ముంటాజమహాల్ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | నాకథ (జీవితం) | 1 | 8 |
| డిటో 3 వ భా॥ | 1 | 0 | గబ్బిలము 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 4 వ భా॥ | 1 | 0 | డిటో 2 వ భా॥ | 1 | 0 |
| డిటో 5 వ భా॥ | 1 | 0 | పిరదౌసి | 1 | 0 |
| నేతాజీ | 1 | 0 | స్వయంవరము | 1 | 0 |
| బాపూజీ | 1 | 0 | తెరచాటు—కల్పిత | | |
| కాందిశీకుడు | 1 | 0 | నాటకము | 1 | 8 |
| స్వప్నకథ | 1 | 0 | వీరాబాయి—చరి | | |
| రాష్ట్రపూజ | 0 | 5 | త్రాత్మక నాటకము | 1 | 8 |

## శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారి
## ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉమర్ ఖయ్యాం | 1 | 0 | శబరి | 1 | 0 |
| పంచవటి | 1 | 0 | మృత్యుంజయం | 1 | 0 |
| బృందావనము | 1 | 0 | శృంగారచాటువులు | 1 | 0 |
| సుభాషితము | 1 | 0 | | | |

## శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి

ఆంధ్రపౌరుషము (పద్యకావ్యము) 1—0—0

## వేగుజుక్క గ్రంథమండలి. (బరంపురం) వారి
## అపరాధ పరిశోధక నవలలు

వాడేవీడు 1 వ భాగము 1—8—0

| | | |
|---|---|---|
| నేనే | 2 వ భాగము | 1—8—0 |
| కాలూరాయి | 3 వ భాగము | 1—8—0 |

(ఈ పై మూడును కలిసి జుమిలియా కథ యగును.)

| | |
|---|---|
| వేంకట్రావు | 1—8—0 |
| కోటీశుతనయ | 1—8—0 |
| విద్యార్థివిపత్తు - (కర్లపాలెం కృష్ణారావుగారు) | 1—0—0 |

## ఆంధ్రప్రచారిణీ గ్రంథమండలివారి నవలలు

| | | |
|---|---|---|
| సీతారామరాయలు | 2 | 0 |
| రాజసింహ | 2 | 0 |
| మృణ్మయి | 1 | 8 |
| సంపూర్ణ శ్రీకృష్ణ చరిత్ర 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| అపరాజిత | 1 | 8 |
| మధుర | 1 | 8 |
| మృణాళిని | 1 | 8 |
| విషవృక్షము | 1 | 8 |
| కృష్ణకాంతుని మరణ శాసనము—పరిశోధక నవల | 1 | 8 |
| కమలాకాంతుడు | 0 | 6 |
| శకుంతల | 1 | 0 |
| పూర్ణానందము | 2 | 0 |
| దృఢప్రతిజ్ఞ | 1 | 8 |
| వసుమతీవసంతము | 2 | 0 |
| అపరాధిని | 1 | 8 |
| ప్రణయచాంచల్యం | 1 | 8 |
| రజని | 1 | 0 |
| వంగవిజేత | 1 | 8 |
| నాకాభంగం 1 వ భా॥ | 2 | 0 |
| డిటో 2 వ భా॥ | 2 | 0 |
| నూర్జహాను | 2 | 0 |
| అల్లాహో అక్బరు | 1 | 8 |
| జమీందారు — రామరాజు | 1 | 8 |
| క్షమార్పణ | 2 | 0 |

## కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి నవలలు

| | | |
|---|---|---|
| అహల్యాబాయి | 1 | 8 |
| రాజరత్నం | 1 | 8 |
| కృష్ణవేణి | 0 | 12 |
| హేమలత | 1 | 4 |
| కర్పూరమంజరి 1వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| రామచంద్రవిజయం | 1 | 4 |
| సౌందర్యతిలక 1వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| వినోదములు 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| Tales of Rajasthan అను రాజస్థానకథావళి 1 భా | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| మణిమంజరి | 0 | 8 |
| సువర్ణగుప్తుడు | 0 | 6 |
| చమత్కారమంజరి 1 భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| Lives of Great men మహాపురుషుల జీవితచరిత్రలు 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| మహాపురుషుల జీవితచరిత్రలు 3 వ భా॥ | 1 | 8 |
| రామకృష్ణ పరమహంస Life and Teachings | 1 | 0 |
| ప్రహసనమంజరి | 1 | 0 |
| నవ్వులగని 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| నానక్ చరిత్ర | 0 | 12 |
| గురుగోవింద చరిత్ర | 0 | 12 |
| సిద్ధార్థ చరిత్ర–గౌతమ బుద్ధుని జీవితం | 1 | 0 |
| రఘుకులచరిత్ర – రఘువంశం | 0 | 10 |
| సుధాశరచ్చంద్రము 300 పే॥ Lake of Palms | 2 | 0 |
| గణపతి హాస్యనవల 1 భా | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| నందచరిత్ర | 0 | 6 |
| కృపాంభోనిధి (భక్త చింతామణిలో వలెనే భక్తిరస పద్యములు కలవు) | 0 | 4 |
| భారతకథామంజరి | 0 | 8 |

## శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రిగారి
## పరిశోధక నవలలు

| | | | |
|---|---|---|---|
| భీషణ ప్రతిహింస | 1 | 8 | 0 |
| ఘోరప్రతిక్రియ | 1 | 8 | 0 |
| బలవంతరావు | 1 | 8 | 0 |

## అపరాధపరిశోధక నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| వలపులరాణి | 1 | 0 | రక్తవాహిని (5 హత్యలా!) | 1 | 0 |
| అగ్గిరాముడు | 1 | 0 | ఇంద్రజాలము | 1 | 0 |
| భయంకరుడు 1 భా | 1 | 0 | రాజద్రోహి | 1 | 0 |
| నరేంద్రుడు 2 భా | 1 | 0 | అర్ధరాత్రి వింత (3 హత్యలు) | 1 | 0 |
| రమేశబాబు | 0 | 12 | దురాశ 1 భా | 1 | 0 |
| సర్కిల్ రంగనాధన్ | 1 | 0 | డిటో 2 భా | 1 | 0 |
| శకుంతల బి. ఎ. | 1 | 0 | దొంగలనాయకుడు | 1 | 0 |
| నీవేనా ? | 1 | 0 | మోహపిశాచం (270 పే॥) | 1 | 8 |
| శక్తికుమార్ | 1 | 0 | కాలసర్పము 1 భా | 1 | 0 |
| పంజాబు మెయిలు | 1 | 0 | డిటో 2 భా | 1 | 0 |
| కన్నపుదొంగ 1 భా | 1 | 0 | ఆనందభవనము | 1 | 0 |
| పగటిచుక్క 2 భా | 1 | 0 | మిస్ మధురిక | 1 | 0 |
| డిటో 3 భా | 1 | 0 | వ్యామోహము | 1 | 0 |
| (యీ 3 మూడుభాగములు చదివిన కథపూర్తియగును.) | | | విషహృదయం | 1 | 4 |
| రమాసుందరి 1 భా | 1 | 0 | | | |
| డిటో 2 భా | 1 | 0 | | | |

| | | | |
|---|---|---|---|
| నేనంటేతంటా | 1 8 | హాతింతాయి | 0 1 |
| ఛాందసుడు | 0 12 | మగడుకాని మగడు | 1 |
| అల్లరిపిల్ల | 0 12 | | |

## తల్లావఝుల శివశంకరశాస్త్రిగారి

| | | | |
|---|---|---|---|
| జీవనసంధ్య అను | | చదువుకున్న భార్య | 1 |
| తేజసింగు | 1 8 | ధర్మరాజు | 1 |
| జీవనప్రభాతము అను | | నేనెవరి భార్యను | 1 |
| రఘునాథజీ | 1 0 | నేనెవరి భర్తను | 1 |
| లవంగలత | 1 8 | | |

## శ్రీ వత్సవాయి రాయజగపతి వర్మగారి

మోడరన్ మేరేజస్ 1 8

## శ్రీ పొక్కులూరి రామచంద్ర శర్మగారి

హిందీ తెలుగు కోశ్ 6 0

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి